"**Madhava Madhuryam**" - A Sketch on Lord Krishna concept
by Palle Seenu, Neredupally, WARANGAL - 506 349


Srilekha Publication No. 20
(17-2-97)

Price. Rs. 26-00

Cover Contribution : Bapu

*For Copies*

1. **Srilekha Sahiti**
   H.No. 5-11-481, Vidyaranyapuri
   Warangal - 506 009.

2. Vishalandhra Book House and its Branches

3. Palle Seenu
   M.A., B.O.L.
   Po: Neredupally, Via: Mallampally
   Warangal - 506 349

*Printed at*
SRI SHANTHI PRINTING PRESS
#: 4-10-29, Kohinoor Hotel lane,
Chowrasta, HANAMKONDA - 506 001
Ph: 79541

# శ్రీలేఖ

శ్రీలేఖ సాహితి ఇప్పటికి వివిధ సాహిత్య ప్రక్రియలకు చెందిన పందొమ్మిది గ్రంథాలను ప్రచురించటం ద్వారా సాహిత్య సేవలో తన వంతు బాధ్యతను నిర్వహించటంలో ముందుకు సాగుతున్నది. గత సంవత్సరము వరంగల్లులో మొట్టమొదటి సారిగా 1996 అక్టోబరు 12 నుండి 18వరకు అష్టావధాన సప్తాహమును నిర్వహించినాము. సాహిత్య సమావేశాల్లో భాగంగా. ప్రస్తుతం "మాధవ మాధుర్యం" కావ్యమును అందించటానికి అనుమతించిన శ్రీ పల్లెసీను గారికి మనఃస్ఫూర్తిగా మా కృతజ్ఞతలు.

శ్రీ పల్లె సీనుగారు భావుకుడు. సౌందర్యోపాసకుడు. ఆయన నవల, నాటకం, కవిత్వము, గేయఖండిక మొదలగు ప్రక్రియమలలో పుస్తకాలు అందించి సాహిత్యలోకానికి చిరపరిచితులు అయినారు. గతంలో మా "శ్రీలేఖ సాహితి" వారి "జన్మభూమి సిరులు" అను ఖండ కావ్యమును అందించింది, ప్రస్తుతం వారు కృష్ణ తత్త్వ భావ వీచికగా వెలువరించిన "మాధవ మాధుర్యం" అను భావుక కావ్యమును మీ ముందుంచుతున్నాము.

మా శ్రీలేఖ సాహితి పురోగమించటంలో మీ చేయూతను సదా ఆశిస్తూ......

డా॥ టి. శ్రీరంగస్వామి
అధ్యక్షులు
శ్రీలేఖ సాహితి

# మా ప్రచురణలు

1. శ్రీరామ శతకము-శ్రీ టి. రామానుజస్వామి రూ. 10-00
2. కవితాగానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 3-00
3. ద టు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - డా॥జి॥ దామోదర్ తెలుగు అనువాదం రూ. 5-00
4. వేణు తరంగాలు - యల్. వేణుగోపాల రావు రూ. 5-00
5. ప్రభవ (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) ఒక సహృదయం
6. వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15-00
7. కవితావనం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 6-00
8. జన్మభూమిసిరులు - శ్రీ పల్లె సీను రూ. 6-00
9. జీవన రాగాలు - శ్రీ యల్. వేణుగోపాల రావు రూ. 10-00
10. శుక్ల (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 5-00
11. ఎమ్మెస్సార్ కథలు - శ్రీ యం. సుబ్బారావు రూ. 9-00
12. ప్రమోదూత (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6-00
13. నా మాట (శతకం) - శ్రీ యం. సుబ్బారావు రూ. 3-00
14. ఏకశిల వైతాళికులు (వ్యాస సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30-00
15. ప్రజోత్పత్తి (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6-00
16. కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక - శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15-00
17. కావ్యం - కవిస్వామ్యం-శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులురూ. 30-00
18. విశ్వనాథవారి కృష్ణ కావ్యాలు- డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 60-00
19. నిరంతరం (కవితా సంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి రూ. 10-00
20. మాధవ మాధుర్యం (కృష్ణతత్త్వవీచిక)-శ్రీ పల్లెసీను రూ. 26-00.

ఇష్టదైవమూ ఇలవేలుపూ

శరచ్చంద్ర చంద్రికా ప్రకాశమూర్తి

శ్రీశ్రీశ్రీ తిరుమల శ్రీనివాసమూర్తి

చరణసన్నిధికి

ఈ "మాధవమాధుర్యం"

ఓ "ఉపద"

- పల్లేసీను



## PALLE SEENU

(Palle Srinivas)

18-2-1943

Place of Birth : Neredupally, Mallampally, Warangal

Qualification : M.A., B.O.L.

Address : Neredupally, Via: Mallampally,
WARANGAL - 506 349

Books Published :
1. Rudhirankitham 1966
2. Radhamma pelli 1969
3. Janmabhoomi Sirulu 1988

Un Published :
1. Vidhi leelalu (Novel)
2. Freeverse plalets,light songs
3. Raaga Pankthulu (Freeverse)

Associated with :
1. Vice-president
   Sri Lekha Sahithi, Warangal
2. Yuva Kala Samithi
   Neredupally, Warangal

# మాధవారాధకులకు - - -

మన భారతేతిహాస పురాణగతాన్ని ఒక్కమారు కదిపితే ఏ యుగంలోనైనా మనోరంజకంగా సాగి, సంగీత సాహిత్యాది కళల్ని జీర్ణించుకున్న "చిత్ర విన్యాసాలు" మానవ మేధస్సుల్లోనే చిత్రీకరింపబడివున్నాయి.

వేద ఘోష ఓ సంగీతమైతే, వాని నడకలో అల్లుకున్న శృంగార, భక్తి, సాహిత్యరీతులు, బ్రహ్మాండమంతా నిండిన రసప్రవాహాలయ్యాయి. ప్రాణికోటి అంతర్యాల్లో నిలిచిన ఆ సుందర ప్రవాహ స్వరూపాల్ని కూడ ప్రకృతి సామీప్యంగానే సందర్శింపగలిగాం. ఈ నాటికీ అదే స్ఫూర్తి మనలో సజీవంగా నివసిస్తోంది., దానిని కదలించి సద్వినియోగం చేసుకోవడంలోనే మనకున్న విజ్ఞత ప్రదర్శించబడుతోంది.

ఆనాటి ప్రభుత నుండి సైతం - కవిత్వం పలికింది. గీతం ధ్వనించింది. శిల్పం రూపు దిద్దుకుంది. నాట్యం అలరించింది. చిత్రలేఖనం శివమెత్తింది. ఏమైనా - అన్నిటి నుండీ.....స్రవించింది హృదయరంజకమైన మాధుర్యమే. ఆ "మాధుర్యం" విశ్వ కళాంజలిలో లయమై, ప్రాణికోటి నంతా తన ఒడిలోనే నిద్రింపజేసుకుంది. ఆ మీద లాలించి తన్మయత్వాన్ని ప్రసాదించింది. ఆ తన్మయత్వంలోని దివ్య దృష్టికి మాతృక భగవానుడైతే, అందలి సృష్టికి మాతృక ప్రకృతి, అంటే అమ్మ. అలా...ఆ మాధుర్యంలోనే భగవానుడూ...ఆ తరువాత అమ్మా...చోటుచేసుకున్నారని విశ్వసించడంలో తప్పు లేదు.

అలాంటి....ఆ భగవన్మాతృ తత్త్వమే నా మాతృమూర్తిలో ప్రభవించి, నాలో వాత్సల్యామృతాన్ని నింపడంతోనే ఈ "మాధవమాధుర్యం" ఉద్భవించింది.

నాటి సంస్కృతీ, సాంప్రదాయాలు ఎలా వున్నా, కాలానుగుణంగా జన్మించే మానవ వైఖరిననుసరించి, కావ్యాలు మారుతూ ఉండడం సహజం. అన్నిటికీ అతీతంగా ఒకరుంటే, కొన్నిటితోనే యేకీభవించి, వాని పోలికను విడువలేక మరొకరుంటారు, పోతనాదుల "భక్తి కవితా వైశిష్ట్యం" సకల జనరంజకమైంది. కాని నేటి రూపం నవ్యఫణితిని సాగి, "భలే" అనిపిస్తుందనడంలో ఏ మాత్రం సందేహం లేదు. ఏది యెట్లున్నా సామాన్య జనాహ్లాదం నేటి రచనా తత్వం.

గోపాలకుడైన మురళీధరుని గురించి బమ్మెర పోతనామాత్యుడు, పొగడవలసిన రీతులన్నీ గోరుముట్టుగా పొగడివదిలాడు. కాని పోతన తన దృష్టిలో శ్రీకృష్ణుని నూరుపాళ్లా భగవంతుడుగానే వ్రాశాడు. ఒక వేళ కృష్ణుడు మానవ మాత్రుడేయని తనవాళ్లనుకుంటే,

అతనిలోని దైవత్వాన్ని అప్పుడప్పుడూ చూస్తూ వెంటతిరిగే బంధుజన సందోహమంతా యెలా వుంటారు? భగవానుడుగా ప్రభోధిస్తూనే తన పాత్రనే మరచి, ఒక్కొక్కరి పట్ల తనెలా ప్రవర్తిస్తాడు? అనే విషయాన్ని మధురమధురమైన పలుకులతో చెప్పాలనుకుని నేనీ గ్రంథాన్ని ప్రారంభించాను. ఆద్యంతమూ మధురమైన అనుభూతే తప్ప, కథకు ప్రాధాన్యమివ్వలేదు. అసలు కథా క్రమమే పాటించలేదు. అట్లని మూలంలో వున్న పాత్రను కదలించనూలేదు. చక్కని సందర్భాలు, సంఘటనలు మాత్రమే తరచి చూశాను. కృష్ణభగవానుడికి క్రీనీడలాసాగుతూనే.....మరుగునపడి వున్న మరిన్ని పాత్రలను కదిలించి, వారిలోని కమనీయ తత్త్వాన్ని దర్శించి కరిగిపోయాను. అలాగే ఆ మూర్తికి జన్మ ప్రసాదిని దేవకీదేవినీ, వాత్సల్య ప్రదాయిని యశోదాదేవినీ నిండుగా అభివర్ణించడమే నాకు కలిగిన పూరట.

కృష్ణ భగవానుడి జనఃాంతర్గతమందలి "ప్రాణికోటి" మహత్తరమైన ఘోష యేదో చేసి, బహుధా సవ్యస్థితిని బొందేందుకు చేసిన ఆరడి, పిదప జీవితంలో అక్కడక్కడా ప్రతిఫలించినట్లూహించిన నేన, "యదార్థం కాదనే" యోగులతో ఏకీభవించక పోవచ్చును, మన్నించాలి. కారణం, నామనోం తర్గతమందున్న జటిల సమస్యాపరిష్కార నిర్వహణలో కృతకృత్యుడి నవ్వాలనే ఉద్దేశ్యం తప్ప వేరేమీ క దు. ఆద్యంతరహితమైన సృష్టిలో విశ్వమయుని కూర్పులనంతాలు నింపాదిగా తన రచన సాగిస్తూనె ఉంటాడు. అది ఎంత సాగుతుందో ఎక్కడ ఆగుతుందో తాను గమనించడు, కాని విసుగూ-విరామం లేక ఆ రచన సాగించడం మామూలే. అయినా! "భగవంతుడనే' ' ఒక్క పాత్రలో అంతులేని తృప్తి - అసంతృప్తుల భజన వల్ల ఉత్పన్నమయ్యే "స్వరూపకాంతి" అనంతమే మరి! దాన్ని "రవంతవూది", "చలికాచుకునేంత" జ్వలింపజేసే ప్రయత్నం చేశాను అంతే!

మరొక్కమాట --

రాధాదేవిలో కూడ "ఈసు" కలిగించిన మన కావ్యాలు ఆమె పాత్రకు అన్యాయమే చేశాయని నాకనిపించింది. ఆమె "పూజారిణి" తప్ప "శృంగార రసకాంక్షి" కాదని మనవి. " వంశీవశి" రాధను కేవలం రమ్యకృష్ణోపాసకురాలిగానే చిత్రించాను అంటే సాహసమే మరి! "రాధ పొందిన మానస సౌందర్య పరిపూర్ణతకి, బదులుగా కృష్ణస్వామికిచ్చే తృప్తిలోని అంశమే ఆరాధనంగా [illegible]డనీ, ఆమె తన నిరీక్షణలో నిరంతరం వేగినా, స్వామి అభయహస్తం వొకటి నిండుగా తననే ఓదారుస్తుందనీ విశ్వసించే రాధ "మహాయోగిని" అని నాకున్న పరిజ్ఞానంతో వ్రాశాను.

తరువాత- "సత్యభామ పశ్చాత్తాపం" పరిణతి పొందిన తీరూ స్పృశించాను. ఇక ఆ లీలామానుష విగ్రహుని "సౌందర్యమూ", భగవంతుడి తత్త్వ స్ఫూర్తిని పొందిన " ప్రౌఢిమా"

ఆయనలో అంతర్లీనాన్ని సూచించే "లయమూ" మృదువుగా అష్టవిధాంశాలుగా వ్యక్తం చేశాను.

దీనిని ఆద్యంతమూ చదివి, నాలో వున్న "కృష్ణానుభూతి" మేరకు అమృతాంశువుగా గుర్తించగలిగిన సహృదయ పాఠకులందరికీ కృతజ్ఞుడిని. పూజ్యులైన పెద్దలు, విశేష భక్తి సంపన్నులు, భాగవత మూర్తులు, నా జిజ్ఞాసను పరిశీలించి మన్నిస్తారని ఆశిస్తున్నాను.

నా మాధవ మాధుర్యాన్ని నిండుహృదయంతో తరచి, గుర్తించి ఆస్వాదించి, ఆశీర్వదించిన పూజ్యులు ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులు గారికి,

ఈ మధురభావ తరంగాల్ని విస్తృతపరచి, "....అఖిలంమధురం"గా అనుభూతి పొందిన మాన్యశ్రీ తుమ్మపూడి కోటీశ్వర రావు గారికీ,

ఈ గ్రంథమందలి కృష్ణతత్త్వ భావలహరిలో తానమాడి, కృష్ణరశ్మిసోకినంతనే పులకితులై భావసాక్షాత్కారాన్ని మహనీయంగా దర్శింపజేసిన మహనీయులు 'ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు గార్లకు

హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు.

నిరంతర ప్రోత్సాహకులూ, ఆప్తమిత్రులూ అయిన డా. టి. శ్రీరంగస్వామి గారు నా యీ చిన్న గ్రంథానికి కృష్ణమేఘమై స్నేహామృత వర్షాన్ని కురిపించినందులకు నేనెంతో కృతజ్ఞుడిని. కృష్ణున్ని అందంగా చిత్రించిన బాపుగారికి, దానిని వాడుకోవడానికి అనుమతించిన శ్రీ బాపుగారికి నా హృదయపూర్వక కైమోడ్పులు.

ఈ భావుక కావ్యానికి తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆర్థికంగా చేయూతను అందించారు. టి.టి.డి. కార్యనిర్వాహక వర్గమునకు కృతజ్ఞతలు.

తనదైన శైలిలో శ్రద్ధ తీసుకొని, చక్కగా ముద్రించి యిచ్చిన మిత్రులు "శ్రీ శాంతి ప్రింటింగ్ ప్రెస్" పచిక నర్సింహా రెడ్డి గారికి కృతజ్ఞతలు, చి॥ తుమ్మల శ్రీనివాస్ రెడ్డికి అభినందనలు తెలియజేస్తున్నాను.

శ్లో॥ "వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ !
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్" !!

- పలెసేను

# ఆస్వాదము

ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య

మిత్రులు శ్రీ పల్లెసీనుగారి 'మాధవ మాధుర్యం' ఈనాటిది కాదు. దానికి గొప్ప పరంపర ఉన్నది. సుదీర్ఘమైన ప్రవర ఉన్నది. దాని తీరేమిటంటే-

శ్రీ రామచంద్రుడు ఒక సారి లీలాశుకుని దగ్గరికి వచ్చి - ఏమయ్యా! శ్రీ కృష్ణుడిని ఎన్నో విధాలుగా భావిస్తున్నావు, ప్రేమిస్తున్నావు. ఎన్నెన్నో మధురాతి మధురమయిన వాక్చిత్రాలు గీస్తున్నావు. పడిపడి నానా రకాలుగా నమస్కారాలు చేస్తున్నావు. అంతవరకు బాగానే ఉందిగాని, శ్రీకృష్ణుడి కన్నా ముందరి అవతారమూర్తిని గదా నేను! మరి నా కెందుకు ఒక్కసారయినా నమస్కారం చేయవు? అని అడిగాడట. అప్పుడు లీలాశుకుడు శ్రీరామచంద్రుడిని ఆపాద శిరఃపర్యంతం ఎగాదిగా చూసి, వినయంగానే - ఎందుకు నమస్కారం చేయను ? తప్పక చేస్తాను గాని....' అంటూ నసిగేటప్పటికి...' ఆ 'కానీ' ఏమిటయ్యా! చెప్పేదేదో సరిగా చెప్పేసేయి అన్నాడట రామచంద్రుడు. 'కాని...కాని..ఒక్క షరతు ఉంది' అన్నాడు లీలాశుకుడు. 'ఏమిటా షరతు' - శ్రీరామచంద్రుడు విసుక్కున్నాడు-నాకు కూడా షరతులు పెట్టటమేమిటి? అని కావచ్చు. 'ఏమిటంటే - నెమ్మదిగా లీలాశుకుడు:

విహాయ కోదండ శరౌముహూర్తం
గృహాణ పాణౌ మణి చారు వేణుమ్
మాయూర బర్హంచ నిజోత్త మాంగే;
సీతాపతే! త్వాం ప్రణమామి పశ్చాత్!

(శ్రీ కృష్ణకర్ణామృతమ్-3-95)

ఒక్క క్షణం సేపు నీ చేతుల్లో ఉన్న ఆ ధనుర్బాణాలను తీసి అవతల పెట్టు. ఒక అందమయిన వేణువును పట్టుకో, తల మీద ఒక నెమలీకను, అలంకరించుకో, ఆ తరువాత, ఓయి సీతాపతీ! నీకు నమస్కరిస్తాను' అన్నాడు నిబ్బరంగా. పాపం శ్రీరామచంద్రుడేం చేస్తాడు? చేతులారా ధనుర్బాణాలను వదిలివేయలేడు గదా! అవి శ్రీరామచంద్రావతారానికి ప్రతీకలు. అవి వదిలేస్తే ఆయనేమయిపోవాలి! లీలాశుకుడన్నట్లయిపోవాలి. అంటే శ్రీ కృష్ణుడయిపోవాలి. అందుకని,

ఎన్నుకొన్నాడు, లీలాశుకుడు శ్రీకృష్ణ ప్రేమికుడు, శ్రీకృష్ణ తత్త్వమాధుర్యానుభవంగా 'శ్రీకృష్ణ కర్ణామృత' మహారచన చేసిన మహానుభావుడు, లీలాశుకుని ఈ శ్లోకం ఇలాంటి సందర్భాన్ని మధురంగా భావింపజేస్తుంది.

మరోసారి ఇంకెవరో వచ్చి- 'ఏమయ్యా, లీలాశుకా! నువ్వు శైవుడివి కదా! మరి శివుడిని గురించి పద్యాలు రాయక ఆ శ్రీ కృష్ణుని పట్టుకొని అన్నన్ని పద్యాలు రాస్తావెందుకు?' అన్నారట. అప్పుడు ఆ లీలాశుకుడు -

శైవావయం, న ఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీ జపపరా నితరాం తథాపి
చేతో మదీయ మతసీకుసుమావ భాసం
స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరమ్
(శ్రీ కృష్ణ కర్ణామృతమ్-2-24)

- అవును, మేము శైవులమే, అందులో సందేహించవలసిందేమీలేదు. అంతేకాదు, పూర్తిగా పంచాక్షరీ (నమశ్శివాయ) జప పరాయణులమే కాని, ఏం చేయమంటారు! నా చేతస్సు - చైతన్యం మాత్రం అతసీ కుసుమావభాసి, స్మేరాననుడూ అయిన గోపవధూ కిశోరుడిని మాత్రమే స్మరిస్తూ ఉంటుంది' అని వాస్తవిక సమాధానమిచ్చాడు. ఎంత వాస్తవమయినా, ఈ స్థితి చిత్రంగా లేదూ! జపించేదేమో పంచాక్షరిని, స్మరించేదేమో గోపవధూకిశోరుడిని. ఈ విధమయిన చైతన్య వైచిత్రి మన పోతన గారిలోనూ ఉండింది. మహేశ్వర ధ్యానం చేస్తున్న పోతన గారికి సాక్షాత్కరించింది శ్రీరామచంద్రుడు. భాగవతం 'పలికించు విభుండు రామ భద్రుండు' కాగా మరి 'చిత్తంబున పెన్నిధానంబునుంబోని శ్రీరామచంద్రుని సన్నిధానంబు కల్పించుకొని పోతనగారు షష్ఠ్యంతాలు రచించింది శ్రీకృష్ణుని గురించి. అంతే కాదు; - గోపికా నివహమందిరయాయికి శేషశాయికిన్ సమర్పితంబుగా 'భాగవతం రచించారాయన. అంటే పోతనగారి జీవన చైతన్యంలో శివరామకృష్ణ-త్రిపుటి సంపుటితమయిందన్న మాట.

ఈ వైచిత్రి ఆధునికంగా విశ్వనాథ సత్యనారాయణ గారిలో మరల ఆవిష్కృతమయింది, 'జాగ్రదావస్థనేమియన, స్వప్న సుషుప్తులయందు రామనామ గ్రహణంబె నా నయనమానస జిహ్వలు సేయు.....' నన్న సత్య నారాయణ గారు - 'నీలగళా! రఘూత్తముడు నీవును నిద్దరు కాని యట్లుగా నోలిభజించితిన్ మరియు నున్నదినంబుల నట్టె చేసెదన్ వ్రాలెడు మేనుదాక నభవా!....' అని శివ,రామచంద్రులను 'ఇద్దరు'గా కాక ఒక్కరుగా భావించారు, ఈ భావన-ఆయన

శ్రీ కృష్ణాయను మాట వచ్చినది యా యేయూహాయో కల్మి, ఈ
శ్రీ కృష్ణాయను మాటవచ్చినది నా హృత్సీమలో నెందునీ
శ్రీ కృష్ణాంకితమయిన యూహ తొలినెట్లేపారు దానిం గనన్
లేకన్ ప్రాణము సొమ్మ సిల్లెదఁ గుకూలీ భూతజీవేశ్వరా!

అన్నారాయన 'గోపికా గీతలు' చివర. మరి సత్యనారాయణ గారి అత్యంత విస్తృతమయిన సాహిత్య సృష్టిలో రామాయణ కల్పవృక్ష విషయం అట్లా ఉంచితే, కృష్ణ సాహిత్యమే, శ్రీకృష్ణ తత్త్వమే, శ్రీకృష్ణతత్త్వ భావనయే అత్యధికం. ఒక విధంగా చెప్పితే, మొత్తం తెలుగు సాహిత్యంలోనే సత్యనారాయణ గారి కృష్ణ సాహిత్యమంతటిది మరెవరిదీ లేదేమో! అసలు మొత్తం సాహిత్యంలోనే కృష్ణ సాహిత్యం పాలెక్కువ, ఎందుకటా!

'రామోవిగ్రహవాన్ ధర్మః, శివుడు జ్ఞాన మూర్తి. మరి శ్రీకృష్ణుడు అచ్చంగా ప్రేమావతారం. ఆ ఇద్దరి లక్షణాలూ ఈయనలో ప్రేమసుషమా పరిప్లావితంగా విలీనమయిపోయినయి. అనభిగమ్యత్యం, అ ప్రధృష్యతం శ్రీకృష్ణతత్త్వానికి సరిపడని అంశాలు. అందువల్ల ఇక్కడ ఆయనకీ మనకీ మధ్య ఎడం లేదు. ఆయన మనలో కలిసిపోతాడు. మనం ఆయనతో ఆడుకోవచ్చు, పాడుకోవచ్చు. ఆయన మీద కోప్పడ వచ్చు, విసుక్కోవచ్చు. కట్టవచ్చు, కొట్టవచ్చు ఆయన ఏమీ అనడు. అన్నింటినీ ఆత్మీయీకరించుకొంటాడు. మన విషయంలో ఆయన గూడ అట్లాగే ప్రవర్తిస్తాడు. మన కిష్టమయిన ఏ మానవీయ సంబంధాన్నయినా నిర్వహిస్తాడు. మన బాధలు బరువులు భరిస్తాడు, మనను ఓదారుస్తాడు, మనం ఓదార్చితే, ఓదార్పుచెందుతాడు. మన ఆలోచనలు, అనుభూతులలో పాలు పంచుకొంటాడు, శ్రీరామచంద్రునివలె ధర్మ సంస్థాపన చేస్తాడు. శివుని వలె జ్ఞానోపదేశం చేస్తాడు. ప్రేమమూర్తిగా లాలిస్తాడు. చిలిపి పనులు చేస్తాడు, ఆలోచింపజేస్తాడు, అనుభవింపజేస్తాడు. కాగా శ్రీకృష్ణ విషయంగా ఉన్నంత సౌలభ్యం మరెక్కడా మనకు లభించదు. అందుకే పరమపామరుల నుండి పరమ విజ్ఞుల దాకా అసంఖ్యాకులు శ్రీకృష్ణ ప్రేమను, సౌలభ్యాన్ని అనేక విధాలుగా అనుభవించారు. ప్రేమలోని అనంత వైవిధ్యం శ్రీకృష్ణ విషయంలో సాఫల్యం పొందుతున్నది. అందుకే శ్రీకృష్ణ సాహిత్యం అంతటి విస్తృతిని పొందింది. సర్వకళారూపాలలోనూ విస్తృతంగా అభివ్యాప్తమయింది.

సంస్కృత భాగవత విషయం అట్లా ఉంచితే, అలనాటి జయదేవుడూ, లీలాశుకుడూ మొదలయిన వారు, ఉత్తరాదిన సూరదాసు, మీరాదేవి మొదలయిన వారు, దక్షిణాదిన ఆండాళు (గోదాదేవి) ఆళ్వారులు, ఇక్కడ తెలుగు నాట అన్నమయ్య, పోతన, రాయలు, రామకృష్ణుడు, చింతలపూడి ఎల్లన, ముద్దుపళని, నారాయణ తీర్థులు, క్షేత్రయ్య మొదలయిన ఎందరెందరో

మహానుభావులు ప్రేమమయులు శ్రీకృష్ణ తత్త్వాన్ని జనజీవితంలో రంగరించారు. శ్రీచైతన్య మహాప్రభువు మొదలయిన వారు కృష్ణ ప్రేమ మాధుర్య ప్రవాహాలై ప్రవహించారు.

రామభక్తి సాహిత్యం, కృష్ణ భక్తి సాహిత్యం అన్న సాహిత్య విభజన తెలుగులో లేదు కాని కృష్ణ సాహిత్యానికి లోటు మాత్రం లేదు. ఆధునిక కాలంలో భావ కవితా వీధిలోనూ కృష్ణతత్త్వమాధుర్యం వెల్లివిరిసింది. సత్యనారాయణగారు సరేసరి. ఆయన విషయం అట్లా ఉంచితే కృష్ణశాస్త్రి గారు బసవరాజు అప్పారావుగారు మొదలయిన వారెందరో కృష్ణతత్త్వ సమ్మోహితులు. శ్రీ లక్ష్మణయతీంద్రుల కవిత్వం ప్రధానంగా సిరివెన్నెల.

అందుకే చెప్పింది - పల్లెసీను మాధవమాధుర్యానికి గొప్ప పరంపర, సుదీర్ఘమయిన ప్రవర ఉందని. ఇంతటి పూర్వ సంస్కార సంస్కృత భావనామయంగా ఆయన రచన రూపొందింది. అనుభవంగా అభివ్యక్తమయింది. 'మాధవ మాధుర్య'మయి మనకంది వచ్చింది.

శ్రీ కృష్ణుడిని భావన చేయగానే వచ్చేది ఆయన ఒక్కడే కాదు, తన వెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధ వ్రాతమున్....'అన్నట్టు, ఆయన వెంట గోపికలు, గోపకులు నందయశోదలు, దేవకీవసుదేవులు, రాధావిరజలు.... ఇట్లా ఎందరెందరో. భాగవతంలో గోపికలు, గోపకులు అనటమేగాని వారి పేర్లు తెలియదుగాని "మాధవమాధుర్యా"నుభవశీలియయిన సీను హృదయం వాటిని గుర్తు పట్టింది; వారినీ గుర్తు పట్టింది, వారిలో తానూ ఒకడయిపోయినాడాయన, ఒకటై అయిపోయిందాయన మనస్సు. ఆ భక్తి వైవిధ్య మధుమూర్తులందరూ తానే అయి, తానే వారందరయి అన్ని చేతులా, భావనలా అనుభవించింది ఈ 'మాధవ మాధుర్య' రచన. వీరందరూ భావనా మూర్తులు, ఆత్మభావనా రూపులు. వారి ఆలోచనలు ఆరాటాలూ, పరితాపాలూ, పరతాపాలు పల్లె సీను భావ ప్రసార మాధ్యమాలు. అనుభవ ప్రసార సారణులు. అందుకే ఆ వ్యక్తులందరూ ఏదో 'ప్రత్యేకం' అనిపిస్తారు. ఆలోచనలోంచి అనుభవంలోకి, అనుభవంలోంచి విచారణలోకి, విచారణలోంచి వేదనలోకి, వేదనలోనుంచి మాధవునిలోకి ఆసుబోసినట్లుగా తిరుగుతుంటారు. మాధవ మాధుర్యం లోని ప్రతి వ్యక్తి ఏదో ఒకానొక విచిత్రమయిన మధుర మయిన వ్యాకులపాటును అనుభవిస్తూ ఉంటుంది. మరి ఇందరికీ కేంద్ర బిందువయిన శ్రీకృష్ణుడు గూడా వీరందరితో వారివారి స్థాయిల్లో కలిసి పోతూనే వారివారి భావనలను పరిష్కరిస్తూ ఉంటాడు. ఆయా సమస్యలు, ఆయా పరిష్కారాలు అన్నీ పల్లెసీను భావనా ప్రపంచంలోనివే. ఈ విషయం అడుగడుగునా భావుకులయిన పాఠకులకు వ్యక్తమవుతూనే ఉంటుంది.

తీరువేరు. తులనాత్మకమయిన పోలికలతో ఇక్కడ అవసరం పడదు. అయినా భావుకులలో కలిగే స్ఫురణలూ స్ఫురణలే. మధుర నుండి గోకులం వచ్చి వీధుల్లో సాగుతున్న శ్రీకృష్ణుని చూచే గోపికల భావనావైవిధ్యం భాగవతంలో మధురా వీధులలో శ్రీకృష్ణుడు వెళుతున్నప్పటి సందర్భాన్ని తిరుగవేసి చెప్పినట్టుగా ఉంటుంది. మాధవమాధుర్యం (3)లో నాగరిక వాసనకుబదులు పల్లెవాసనలు గుబాళిస్తాయి.

'పల్లె' అనేది అకృత్రిమయిన వాతావరణానికీ, జీవనానికీ, జీవన విధానానికే భావనకు గూడా ప్రతీక. ఈ నాడు పల్లెల్లో ఆ లక్షణం తరిగి పోవచ్చు. కృత్రిమత్వాన్ని అరువు తెచ్చుకొని పూసుకు తిరుగుతూండవచ్చు. అయినా 'ఈ' నాటికీ ఇంకా 'పల్లె'లో అకృత్రిమత్వం పూర్తిగా అణగారిపోలేదనటానికి పల్లె సీను వంటివారి భావనా రీతి ఒక ఉదాహరణ.

భావన మనస్సుకు అనుభూతి సంధాయకమయింది. మనస్సుకు అనుభవించటమే తెలుసు. దానికి అనుభవమే ఉంటుందిగాని భాష ఉండదు. నిజానికి అక్కరలేదేమో గూడా, కాని అనుభవ వ్యక్తీకరణ తప్పని సరయినప్పుడు మధ్యన ఎవరి ప్రమేయం లేకుండా, ఏ మాధ్యమమూ లేకుండా భాషను నేరుగా ఆశ్రయిస్తుంది. అప్పుడు ఆ భాషలో ఒకానొకవిధమయిన 'యాస' ఏర్పడుతుంది. దాన్ని వారి వారి మనోభాషలనవచ్చుననుకొంటే, ఈ 'మాధవ మాధుర్యం' ఆ విధమయిన 'యాస' లో, ఆ విధమయిన భాషలో అభివ్యక్తమయింది. ఆ యాస కొంచెం అలవాటయితే మాధుర్యం తనంతట తానే తొణకటం మొదలవుతుంది.

ఈ 'మాధవ మాధుర్యం'లో అనేక మంది వ్యక్తులు కన్పిస్తారు. మాట్లాడుతారు. ఆలోచిస్తారు, ఆలోచింపజేస్తుంటారు. మరి ఇందరిట్లా ఉన్నా గూడా 'కథ' చెప్పటానికి అనుకూలమయిన అంశం లేదు. సన్నివేశాలున్నట్టు ఆభాసిస్తుంటాయి. భావ కవులు ఆధునికంగా ప్రయోగించిన 'భావగద్య' లక్షణం నేపథ్యంలో విభాసిస్తున్న ఈ రచన 'భావకావ్యం' లేదా 'భావనా కావ్యం' అనవచ్చుననిపిస్తుంది. అందుకని అరుదయిన రచన ఇది. అనుభవ సంధాయకమయిన రచన ఇది.

పల్లె సీను భావ చరితార్థతకీ 'మాధవ మాధుర్యం' సమర్థమయిన ప్రతిరూపం. దానికి భావుకాభినందన ఇది.

ఇం. నెం. 15-9-68 - కోవెల సంపత్కుమారాచార్యులు

రామన్నపేట, తేది 15-12-96.

వరంగల్లు.

# "......అఖిలం మధురం"

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు

"మౌళిశ్చంద్రిక భూషణా మరకత శ్యామాభిరామం వపుః
వక్త్రం చిత్ర విముగ్ధహాస మధురం బాలే విలో లాదృశౌ
వాచః శైశవ శీతలా మదగజ శ్లాఘ్యా విలాసస్థితిః
మందం మందం అయే! కవిషమధురా వీధీమితోగాహతే"
(శ్రీ కృష్ణ కర్ణామృతమ్-1-57)

ఏనాటిభాగవతమో - హరివంశమో - విష్ణుపురాణమో ఏది మొదలు ? శ్రీ కృష్ణ గాథా సంగీతానికి ?. ఆ జయదేవుడు - ఆ లీలాశకుడు। ఆ నారాయణతీర్థులు - అన్నమయ్య-క్షేత్రయ్య - ఇలాంటి కృష్ణ సంగీత గాయకులంతా ఆలీలాతరంగిణిలో జిడ్డు తేరిన మీగడ తరకలే. ఆ మహానంద హ్రాదం నేటి దాకా కవి హృదయతటాలకు తాకి కొట్టుకొని పై కెగసి చింది, నృత్యం చేస్తూనే ఉంది.

ఒక రాజస్థాన్ చిత్రకళారీతిగా - బేలూరు వాస్తు శిల్పంగా, కూచిపూడి నాట్యంగా, శరచ్చంద్రికల్లో రాసక్రీడలాడుతూనే ఉంది. అనాహతమైన కృష్ణ గాంధర్వం కవిభక్త లోక హృదయవంశీ నికుంజంలో మర్మరిస్తూనే ఉంది - అవిశ్రాంతంగా - అశాంతమానవునికి ప్రశాంతి దాయకంగా - ఇది శాశ్వతమైన ఆత్మగాథ ఆలపించే ఆత్మ కళ.

ఈ యుగం శ్రీ కృష్ణ స్వరూపమయిన ద్వాపరం. అది అణువిస్ఫోటనంతో తదంతర్గత చైతన్య నర్తన దర్శనంతో ఆరంభమైనదని వాచా అన్న మహాత్ముడు స్వామియుక్తేశ్వరులు. అంతకు ముందే శ్రీరామకృష్ణపరమహంస శ్రీకృష్ణచైతన్యస్వరూపమైన 'మహాభావ' దర్శనానుభవంతో తదనంతరం శ్రీ అరవిందులు అలీపూర్ చెరసాలలో పరమహాచైతన్య ఘనమైన ఆ నీలి వెలుగు లోకమంతా పెంచి వితానమై పరచుకొన్నది. ఆవరించింది. ఆనాటి కురుక్షేత్ర యుద్ధంలో శ్రీకృష్ణ పాత్రలాంటిదే రెండవ ప్రపంచ మహా యుద్ధంలో శ్రీ అరవింద పాత్ర.

విష్ణు కుండినుల రాజధాని ఉండవల్లిలో కొండల కడుపులు తొలిచి గృహనిర్మాణం చేసి, ప్రథమతః ఆంధ్ర శిల్పి ఉలి నుండి శ్రీకృష్ణవిగ్రహాన్ని ఆవిష్కరించాడంటారు చరిత్ర వేత్తలు. సుమారు 8వ శకాన అక్కడ సరిగా అదే సమయంలో దక్షిణ దేశం చివర శ్రీవిలుబుత్తూరులో

ఒక చిన్న తల్లి - పది పదారవయేటనే కృష్ణుని పై పాటలు కట్టి తీర్చిన ముగ్గులోకి లాగింది. మేడ కట్టింది. ఆమె తండ్రి ఆమెకీ విద్యలో గురువు. కృష్ణుని వత్సల భక్తితో ఆరాధించిన మహాత్ముడు. ఆ పాటలే - పాశురాలే దివ్య ప్రబంధ శ్రీకారాలు.

హిమాలయాల్లో గద్వాల్ చిత్రకారుని (వర్ణలేఖిని) నుంచి దక్షిణ దేశం అంచుల దాకా తూర్పు పడమరలు కోస్తాల రాష్ట్రాల మీదుగా మధ్య దేశాన్ని ఆవరిస్తూనే భారతావనిని పొదువుకొంటూ యమునా స్రవంతి అంతర్వాహినిగా ప్రవహిస్తూనే ఉంది. ఆ నీటి తరగలపై నుండి కొట్టుకొని వచ్చిన నీలికల్వలే గోదా విష్ణు చిత్తులు, జయదేవుని విద్యాపతులు, పోతన్నగారు, శ్రీకృష్ణదేవరాయలు, వల్లభ లీలాశుకులు, నామదేవ్ సూరదాసులు, అన్నమయ్య క్షేత్రయ్యలు....!

ఎన్ని పూలు! నదీ జలాన్ని ఆవరించి నింగిదాకా నీలి కాంతుల్ని వెదజల్లుతూ! ఒక్కొక్క కాడకు ఎన్ని అంకురాలు. నేటికిదొక చిన్న నీలి కలువ. నీలావతారుని పాదధూళి కోసం - ఆమేను తాకిన పవన స్పర్శ కోసం - తపిస్తున్న ఒక గోపిక, ఒక విరహ తపస్విని, అష్టమహిషీ స్వరూపం (8ఖండాలు), లలిత శబ్దమూర్తి, అలసాలసరాధికాగమనంలోని నాట్య రేఖ ఆమె మొలనూలి చిరుగజ్జె సవ్వడి.

## II

నీలాకాశంపైన తేలిపోయే తెలిమబ్బుల్లాగా నీయవనికపైన నటించి తిరిగి అనంతంలోకి యవని కాంతంలోకి కరిగి సురిగిపోయే పాత్రల్లాగా - ఈ వచన నాట్య రంగస్థలిపై దేవకీ వసుదేవులు, యశోదానందులు, రాధావిరజాది గోపికలు, అక్రూర సుచరణాదిపురుషులు, భాగవతంలో ఈ వరుసే కాక, భారతంలో కుంతి, ద్రౌపదీ, ధర్మజులు, ఈ భక్త భూమికలే కాక శిశుపాల కర్ణాది విరుద్ధ భావ పోషణం చేసే నటులు అంతా విరుద్ధావిరుద్ధ వేషధారణం చేసి, కొంచెం సేపు నటించి ఆనందానుభూతిలో ద్రవించిపోతుంటారు, యమునలో లేచే కెరటాల్లాగా, సూర్యకాంతిలో మిలమిలా సుదర్శన ధారల్లాగా మెరుస్తూ కళ్ళు జిగేలు మనిపించటం - ఎంత చిత్రంగా ఉంది ఈ కావ్యధార! ప్రతి పాత్రా తన ధర్మాన్ని కర్తవ్యంగా - దీన్ని దానిగానో, నిర్వహిస్తూ చకచకా వస్తూ పోతూ ఉత్సవంలో ఊరేగే స్వామి రథాన్ని లాగే భక్తసందోహం లాగా సంచడిగా అతిలోకానందనికుంజమైన బృందావన గానం చేస్తూ నటిస్తాయి. యదార్థంగా అంతా ఒక మహోత్సవం, ఒక సంక్రాంతి పండుగ, చిత్ర వర్ణ సమ్మేళనంతో వెలిగిపోయే రంగవల్లి.

ఒక నెమలి పింఛం సూర్యాతపంలోగిరగిరా త్రిప్పినట్లు, రచయిత సూత్రధారుడై పాత్రలనాడింపటం రమణీయంగా ఉంది.

పాత్రలన్నీ నాట్యగమనంలో శ్రీ కృష్ణ కేంద్ర బిందువు చుట్టూ నర్తనం చేస్తూ ఆ వ్యక్తంగా బృందగానమాలపిస్తుంటారు, పోతన్న గారన్నారే-

"జలజాంతస్థిత కర్ణి కం దిరిగిరా సంఘంబులైయున్న రే
కుల చందంబున గృష్ణునిం దిరిగిరా, కూర్చుండి వీక్షింపుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వులా
కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా!"

(భాగవతం-10-493)

అంతా ఒక భంగిమా మనోజ్ఞ నాట్యంచ బృందనాట్యం, కావ్య సూత్రదారుడే ప్రధాన పాత్రలో రంగ స్థలం మీద కథను నడుపుతూనే నడపనట్లు మాట్లాడుతూనే మౌనియైనట్లు ఒక చిత్ర భావాన్ని కల్పిస్తూ, ఎనిమిది అంకాల నాటకాన్ని నడుపుతున్నాడు. చివరిది వస్తు సూత్ర సంహారం, ముడి.

* * *

కథా సన్నివేశం సాగుతూనే ఉంటుంది. ఇంతలో ఒక సంజమబ్బులాంటి వర్ణన. దాని అందమే అందం, లోయల్లో సెలయేటి ముర్మురారావం, రాలుతూ ఉన్న వసంత జీర్ణ పత్ర వలయావర్త నర్తనం, కుసుమిత హల్లకవనం,కార్తీక పౌర్ణమి రాత్రి, సంక్రాంతి ముగ్గులు పెట్టిన ముంగిలి, దీని కిరు ప్రక్కలా సోలుపులై విచ్చిన రంగుల బంతి పూలు పసుపుతోటలో ఎర్రని మెట్ట తామర.

ఈ కావ్య వచన శైలి ప్రత్యేకంగా విమర్శించదగినది. మనకు దీని కొలతకు తగ్గ ప్రమాణాలు లేవు. ప్రాచీనులు నిర్మించుకున్న రెండు మూడు వృత్త గ్రంధి లాంటివి. చాలా మొరటు-నేటి మనస్వికి చాలవు.

చంపూ కావ్యాల్లో వచనం కథనానికి కొరిగింది, వర్ణనకు పద్యం కేవలం వచన కావ్యంలో వాక్యం వ్యవహారిక దశకు జారకుండా నిర్వహించటం క్లిష్టం. కవిలా రామణీయకవేషాన్ని దానికి తొడగటం-కవితాత్మకంగా వచనం వ్రాయటం కష్టం. భవ్య కవితావేశ సమ్మిశ్రితంగా - అదీ సంయమితావేశ భద్రంగా.

కోసమో లేదా శ్రీకృష్ణతత్త్వ సౌందర్య వ్యాఖ్యానార్థమో వచనము ఉపయోగింపబడటం స్పృహణీయంగా ఉంది. ఆ శైలి ముగ్ధ గోపకాంత అందం లాంటిది. సరళంగా ఉంటూనే స్నిగ్ధ బంధురంగా వుంటుంది. స్పష్టమైన భాష. యమున ఒడ్డున మేసే సాధుతా మూర్తి తెల్లని గోవులాంటిది. ఈ భాష కవితాత్మకం. మతాహార్యకం కాదు. ఈ భేదాన్ని గమనించాలి.

శ్రీ విశ్వనాథ వారు శృంగార వీధిలో చివరి మలుపులో ఒక వచన ఖండిక వ్రాసారు. మరి - అది ఈ కవి స్పృహలో ఉందో లేదో తెలియదు కానీ - దానికిది స్మారకంగా మాత్రమున్నది.

గీతా చరమశ్లోకంతో కావ్యాంతం చేయటం కావ్య వస్తు తాత్పర్య సూచకమైన భరతవాక్యం.

"తెలుగు భాష ఒక మురళి పాట" అన్న సత్యాన్ని మరలా ఈ కావ్యం (మాధవమాధుర్యం) గుర్తు చేస్తున్నది.

God has so arranged life that the world is the soul's husband, krishna it's devine paramour. We owe a debt of service to the world and are bound to it by a law, a compelling opinion and a common experience of pain and pleasure but out heart's worship and our true and secret joy are for our love"

(Thoughts and Aphorisms - Sri Aurobindo)

" మలయకూటము"
శ్రీవేంకటేశ్వర నగర్,
అనంతపురం.

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు
8-12-96

# భావ సాక్షాత్కారం

– ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు.

వైయక్తికానుభవము మనస్సును స్పృశిస్తుంది. సమిష్టి అనుభవం మన మనస్సును దాటి బుద్ధినిదాటి, అహంకారాన్ని దాటి చిత్తాన్ని స్పృశిస్తుంది. ఈ అనుభూతి శబ్దరూపం పొందటంకోసం సమిష్టిచైతన్యములోనుంచి, భావరూపాలను చేరుకుంటుంది. శబ్దసంపుటులను, చిత్రాలను సంకలనం చేసుకుంటుంది. ఈ సంకలిత సామగ్రిలో నుంచి ప్రతీకలు, బింభాలు ఆవిర్భవిస్తాయి.

సనాతనమైన జీవచైతన్యసంపుటి, ఇన్నియుగాలుగా త్రవ్వుకొంటువస్తున్న నిర్మించుకున్న ప్రతీకలలో శ్రీకృష్ణ రూపం ఒకటి. అది మానసం దిగి వచ్చినప్పుడు దాని కిరణాలసంపుటిలో విరిసిన శక్రచాపం ఈ శ్రీకృష్ణరూప బింబం. దీన్ని 5000సం॥ల క్రితం మనం ఆవిష్కరించుకున్నా దానిమూలం అనాది అనే చెప్పాలి. వేదపురాణ గహనాలలో యుగాలుగా సంచరించిన వేదవ్యాసునికి వృద్ధదశలో కలిగిన నిర్వేదంలో ప్రతిఫలించిన నీలాకాశంలోనుంచి ఒక సుందర ఆవర్తమై ఈ బింబం పెల్లుబికింది.

ఈ కృష్ణచైతన్యం చుట్టూ మానవుడు తన ప్రేమను అనురాగాన్ని ఆత్మీయతను సమర్పణను మాత్రమే కాక, దుఃఖాన్ని ఉద్వేగాన్ని, వాంఛలను, దైన్యాన్నీ, ఆర్తిని, దౌర్మనస్యాన్ని మాత్రం కూడా కా, క్రోధాన్ని, వైరాన్ని, కసిని, కామాన్ని వలయాలు వలయాలుగా నిర్మిస్తూ వచ్చాడు. ఆ చైతన్యం కేంద్రంగా శ్రీ కృష్ణగాథ వలయాకరింపబడిన సర్వమానవ మనోభావాలను విస్తృతమైన మహాగాథగా ఇతిహాసపు పరిధులను మించిన మహా పురాణంగా రూపుకట్టింది.

శ్రీ కృష్ణభావం "ఆ పాతాళ నభః స్థలాంతరుదిత"మైన జ్యోతిస్స్వరూపం. కృష్ణధాతువు నకు దున్నుటమే అర్థమై కృష్ణ తత్త్వము ప్రకృతి స్వరూపమైన భూమిని త్రవ్వుకుంటూ అట్టడుగుదాక పోతున్నది. కృష్ణతత్త్వము ఎదిగి ఆకాశాన్ని దాటి, సూర్యమండలాన్ని దాటి ,సప్తలోకాలను దాటి, గోలోకాన్ని పరిక్రమిస్తున్నది. గో శబ్దానికి భూమి అని అర్థం. అంటే దివ్య చైతన్యపరిణతమైన ఈ భూమియే గోలోకమన్నమాట. దిశాకాల నిర్దేశపరిమితులకు లొంగని ఈ తత్త్వానికి ఇది క్రింద,ఇది మీద అని చెప్పడం సాధ్యమయ్యే అంశం కాదు కదా! బహుధాకరింపబడిన భావ సంక్లిష్టతలో ఆవిర్భవించిన ఈ శ్రీకృష్ణ చైతన్యంలో సృష్టి అంతా స్థావరజంగమభేదం లేకుండా పాలుపంచుకుంటూనే ఉన్నది. పర్వతాలు, నదులు, చెట్లు, పొదలు, పూలు, ఫలాలు,

ఆవులు, లేగలు, గోపబాలికలు, బాలకులు, మల్లయోధులు, మహారాజులు, రాజనీతివేత్తలు, ఋషులు, యోధులు, సాధకులు, రాసక్రీడలు, రణభూములు అన్నీ ఆ వ్యక్తి చైతన్యం చుట్టూ పరిభ్రమిస్తూ అంతో ఇంతో ఆదైవీ రోచిస్సును తమలోకి ఆవిష్కరించుకునే ప్రయత్నం చేసాయి. నాటి నుంచి, నేటివరకూ చరాచర సమిష్టి అంతా ఆ చైతన్యాభిముఖంగానే ప్రయాణం చేస్తున్నది.

"కామోత్కంఠ గోపికల్ భయమునం గంసుండు, వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తినేమనిదె చక్రిం గంటి మెట్టైనను
ద్ధామధ్యాన గరిష్ఠుఁడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా !

ఈ పద్యంలో పోతనగారు ఆ ప్రభువును చక్రి అని పేర్కొనడం గమనించదగినది. ఈ చైతన్యము సృష్టి చక్రాన్ని సూచిస్తున్నది. సృష్టి అంతా ప్రజాపతి కామనలో నుంచి స్పందచక్రాలుగా పరిభ్రమిస్తూ సాగివస్తున్నది, తొలిమిధునమైన శతరూపా ప్రజాపతులు మన శాక్త సాధనతో కామేశ్వరీ, కామేశ్వరులుగా ఆవిష్కరింపబడ్డారు. ఈ మహాశక్తి సౌందర్య లహరిగా " శ్రీ చక్ర ' ' అధిష్ఠాత్రిగా మనకు ప్రత్యక్షమవుతున్నది. ఈ సౌందర్యభావము స్త్రీ పురుష భావాలకు అతీతంగా ఒకేచోట సమావిష్టమైన ప్రదేశము, శ్రీకృష్ణ భావము. ఈ సూచన శ్రీకృష్ణావతార కథలో మహామాయ దుర్గగా ఆయనకు ముందే జన్మించినట్లు, ఆయనయందే లీనమైనట్లు వర్ణించటం జరిగింది. అనంతర కాలంలో సోదరిగా అవతరించిన దుర్గ వాసుదేవ సంకర్షణులతో పాటు సుభద్రగా పూరీక్షేత్రంలో వెలసిన అంశం ఈ తంత్ర రహస్యాన్ని వెల్లడిస్తుంది.

ఆమె సౌందర్యం ఆయన అనుగ్రహము. ఆమె కేల ఆయనలీల ఇద్దరూ ఒకటియైనప్పుడు ఈ రెంటి సమావేశము అక్కడ. ఆదిశంకరులు సౌందర్యలహరిలో చేసిన దర్శనం ఆశ్చర్యం కలిగించేది. దశమస్కంధంలో వ్యాస భగవానుడు ఈ సౌందర్యమునే శుకముఖాన వెల్లడించాడు.

భాగవత మహాపురాణంలో శ్రీ వైకుంఠమే బృందావనంలోకి దిగివచ్చిన అంశం చెప్పబడింది. అదీ సాంగ సపరివార సశక్తికంగా ఆవిష్కృతమైంది. శ్రీకృష్ణోపనిషత్తులో ఈ అవతరణం వివరంగా ఉన్నది. నందుడు బ్రహ్మానంద స్వరూపుడనీ యశోద ముక్తికాంత అనీ - సత్వరజస్తమస్సులను మించిన మాయాశక్తి వైష్ణవి ఆది బ్రహ్మాదులకు అజేయ. దేవకియే ఈ వైష్ణవి మాయగా దిగివచ్చింది. ఈ వైష్ణవీశక్తి అంటే ప్రణవమే. అందుకే ఉపనిషత్తులు ఆమెను బ్రహ్మపుత్రిగా పేర్కొన్నది. వేదము వసుదేవుడు. వేదార్థము బలరామకృష్ణులు.

ఒకానొక చోట . "Darkness Radiates Light" అని ఉన్నది. ఈ నీలవర్ణమైన చీకటీ, దాని ప్రకాశమైన కాంతీ శ్రీకృష్ణతత్వమే.

నాకు అప్తుడైన మిత్రుడు శ్రీపల్లెసీను ఈ స్వామిని భావిస్తున్నాడు, అనుభవిస్తున్నాడు, పలవరిస్తున్నాడు, కలవరిస్తున్నాడు - ఈ "మాధవ మాధుర్యం"లో . ఏదో ఒక భక్తుడుగా, భావుకుడుగా కాకుండా ఆయనను హృదయంలో బహు భావనలతో సాక్షాత్కరింపజేసుకుంటున్నాడు.

ఈనాడు ప్రాచీన వాఙ్మయం మనకు దురవగాహంగా అనర్థమైన అవగాహనతో అవగతమవుతున్నది. దీనికి కారణం వేయేండ్ల బానిసత్వంలో మన పరంపర విచ్ఛేదం పొందటం. ఆర్ష గ్రంధాలన్నీ ఒక గూఢభాషలో రచింపబడ్డాయి. దాని రహస్యాలు సంకేతాలలో నిబంధింపబడ్డాయి. అది తెలియకుండా వాచ్యంగా దానిని అర్థం చేసుకోవడమంటే దారి తప్పడమే. యూంగ్ ఈ సంకేతాలకు అతీత చైతన్యానికి ఉండే సంబంధాన్ని గూర్చి ఇలా అన్నాడు. " The Unconscious can only be reached and expressed by the Symbol, which is the reason why the process of Individuation can never do without the symbol. The symbol is on one hand the premistue expression of the unconscious, while on the other hand, it is on idea corrosponding to the highest intimate or then produced by consciouness" (The Secret of the Golden Flower). ప్రాచీనులు ఇలాంటి రచననే సమాధి భాష అన్నారు.

మహాభారతము హరివంశము, భాగవత విష్ణు పురాణాలు, విష్ణు వైవర్తము ఇలా ఎన్నో పురాణాలు ఈ కృష్ణతత్త్వాన్ని అనేకములైన గాథలద్వారా, ప్రతీకలద్వారా, వ్యక్తం చేశాయి. ఆనాటినుంచి కృష్ణభావన విశ్వచైతన్యభావన అయింది. చైతన్య మహా ప్రభువు శ్రీకృష్ణదేవుని నామగ్రహణం వలన కనులు అశ్రువులతో నిండినవనియు, ముఖమునుండి, వాక్కు గద్గదమైనదనియు, శరీరం నిండా పులకాంకురములు నిండినవనియు వెల్లడించారు. అంతర్బహిస్సులలో ఆ నామం అంతగా తనను విశదీభూతం చేస్తున్నది.

శ్రీకృష్ణ విరహం జీవకోటి సాధనకు హేతువు. అదే 'జీవని వేదన' తెలిసీ, తెలియక ఈ ఆనందఘనుని విరహంతోనే ఈ జగత్తు పరితపిస్తున్నది. అనంతమైన ఈ విరహం ఆ అనంతుని సంగమందాకా కొనసాగవలసిందే. తరువాత మిగిలేది తానుకాదు. ఆ స్వామియే 'యుగాయుతం నిమేషేణ, చక్షుషా ప్రావృషాయితం, శూన్యాయితం జగత్సర్వం, గోవింద విరహేణమే అన్నారు శ్రీ చైతన్య మహాప్రభువు.

ఈ గాఢమైన అనంతమైన విరహభావం లోనుంచే శ్రీకృష్ణసౌందర్యం ఆవిర్భవించింది. ఈ సౌందర్య సీధువును ఆస్వాదించిన భక్తులు పరవశులైనారు. పాండవమాత కుంతీదేవి ఆయనను భావించినప్పుడు సర్వమూ పద్మమయంగానే దర్శనమిచ్చింది. పద్మం ప్రాచీన గూఢ విద్యలలో ప్రధానమైన ప్రతీక.

నమః పంకజనాభాయ నమః పంకజమాలినే

నమః పంకజ నేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే (భాగ. 1.8. 22)

ఇక్కడ శ్రీ కృష్ణతత్త్వము పూర్తిగా పద్మమే అయింది. పద్మము దివ్యచైతన్యంతో - భౌమ చైతన్యానికి ఉన్న అనుబంధాన్ని సూచిస్తుంది. దివ్యా దివ్యలోకాలనడుమ విప్పారిన సూర్యబింబము ఒక హిరణ్య పద్మమే. హృదయపద్మము దహర విద్యాస్థానము పంకజమాల షట్చక్రములను సూచిస్తున్నది. పద్మనాభ లక్షణము సృష్టివారసత్వాన్ని తెలియజేస్తుంది. ఈశ్వరున్ని పద్మనాభుడని పేర్కొనటం సృష్టి కేంద్రాన్ని, సృజన మూలాన్ని ప్రకటించటమే. ఈ పద్మమే బౌద్ధులకు మణిపద్మము - వజ్రము అయిం ది. 'కస్యాసం పుండరీకమివ అక్షిణీ' అన్న శృతిని పంకజనేత్రత్వము జ్ఞప్తికి తెస్తున్నది.

ఈ భాగవత మార్గంలో కొనసాగిందీ 'మాధవ మాధుర్యం

ఈ కావ్యం ఎనిమిది భాగాలలో విభక్తమైంది.

శ్రీకృష్ణావతారంతో సంబంధించిన వారందరూ ఆయన లీలామృతంలో తడిసినవారే. ఈ వచన ప్రబంధం భావ బం ధురమై మంద్రమధురగీతంవలె సాగిపోయింది.

దీనిలో ప్రసక్తమయ్యే వ్యక్తులలో యశోదానందులు, దేవకీ వసుదేవులు, నారదుడు, అక్రూరోద్ధవ సాత్యకి సుదామ యుధిష్ఠిరాదులు, కర్ణుడు, ఇలాదేవీ సత్యభామ కుంతీ ద్రౌపదులు, విరజాతపతుల వంటి నదీ కన్యలు, కుబ్జ అనేకులైన గోపీగోపకులు, బలదేవుడు ఉన్నారు. అందరికీ శ్రీకృష్ణసాన్నిధ్యమే హద్దు. రాధాకృష్ణులు కేంద్ర స్థానం. వారిద్దరి కలయికయే వీరందరి హృదయాలలో మూల వాంఛ. అక్కడక్కడా రాత్రింబవళ్ళు, ఋతువులు, సన్నివేశాలు కాలపురుషుని నీలినీడల వలె ప్రసరిస్తూ ఉంటవి. అయితే, అఖండమైన ప్రవాహం కృష్ణ భావవాహినిదే.

"విశ్వం ఒక సౌందర్య వాటిక. అక్కడ కుసుమించే ప్రతీ కుసుమం పూజనీయం" (పే 13)

"స్వామి ఎదుట మాటలు తడబడకుండా ఉండటం కూడ ఒక వరమే" (పే 16)

మధురమైన ఇటువంటి భావనలు ఈ రచనకు వన్నె తెస్తూ వున్నవి.

ఉద్ధవునికి స్త్రీ భావం కలుగటం ఈ రచనలో విశిష్టమైన అంశం. తృతీయ, ఏకాదశస్కంధాలలో ఉద్ధవుడు జ్ఞాని. ఈ కవికి ఆయన మధుర భక్తుడైనాడు.

(46)వ పేజీలో స్వామి విశ్వ రూప సందర్శనము ఉన్నది. అణువాదిగాగ బ్రహ్మాండములన్నీ నిండి వెలుగుతున్న శక్తిగా ఆయన దర్శనమిచ్చారు. 'హృదయోన్మాదాన్ని సడలించి వినూత్న అనుభవ జీవం' నింపి వేయగలిగినది' ఆ స్థితి (47 పే)

విరజగాథను రచయిత కల్పించిన తీరు ప్రకాశిస్తూ ఉన్నది. ఈమె వైకుంఠ మార్గంలో ఉన్న నది. శ్రీకృష్ణ రూప సౌందర్య లాలసతో స్వామి వద్దకు దిగి వచ్చింది. మురళీధర

దయామృతాంశుజ విరజ' (అంటే)

దీనిలో ఇళాదేవి ప్రసక్తి ఉన్నది. ఈమె సౌందర్యమునకు ప్రతీకయైన నీళాదేవి కాకపోవచ్చును. ఇల అంటే భూమి. నీళాదేవి గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో నప్పిన్నగా పేర్కొనబడింది. నిత్యార్చనతో శ్రీ భూనీళాసహితుడైన నారాయణుడు పేర్కొనబడుతున్నాడు.

ఈ వచన ప్రబంధంలో శ్రీరాధ అద్యంతముగా వ్యాపించి ఉన్నది. రాధ కృష్ణాభిన్న. దక్షిణదేశంలో ఆళ్వారులు గోదాదేవీ తమను గోపికలుగా భావించుకున్నారు. గోపికల పేర్లు ప్రవృత్తులు ఈయన విచిత్రంగా చిత్రించారు.

ఈ రచన ప్రబంధం మాధవుని మాధుర్యభావనాసముద్రాన్ని దోసిట పట్టింది. ఎవరైనా చేయదగింది అంతే. ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు జ్ఞానులు, ఎవరైనా సంకోచాలు వదలిరండి. దోసిళ్లతో ఆస్వాదించండి, అనుభవించండి.

శ్రీ పల్లె సీనుకు ఈ శ్రీకృష్ణమార్గం యింకా సుగమమై, తేజోమయమై, ప్రకాశించవలెనని ఈ కావ్యం మనందరికీ ఒకింతైనా సంసార గ్రీష్మ తాపోపహతిని కల్గించవలెననీ కోరుకుంటున్నాను

- కోవెల సుప్రసన్నాచార్య
తేది: 3-1-97

ఇం.నెం. 3-440
పరిమళకాలనీ
వడ్డేపల్లి, వరంగల్లు

# ఒక కృష్ణ మేఘం

— డా॥ టి. శ్రీరంగస్వామి

"....మృదుగాన నిస్వనము చిందెడు నిన్‌గని మంద వాయు
పూరిత నినదమ్ములై యనుకరించును నిన్ను వెదుళ్ళు కేశవా!"
(అమృతము - శ్రీగానవీథి)

-అని విశ్వనాథ వారు అన్నటుల శ్రీ కృష్ణభావన. నాకాప్తుడైన పల్లె సీనులో ధ్వనించింది. కృష్ణ రజని అనడం మాత్రం మా ఇరువురికీ ఒకే భూమిక నుండి సోకడం యాదృచ్ఛికమే అయినా, ఆ భావనలో నుండి ఉన్మీలనము కావడము వేరు వేరుగా అయింది. ఆయన ప్రస్తుతకావ్యము "మాధవ మాధుర్యము" అందిస్తే, నేను విశ్వనాథ శ్రీకృష్ణ సంగీతములో వేణువునై సంపత్ ప్రకాశితుడనైనాను.

అదట్లా ఉంచితే - శ్రీ పల్లె సీను గారు వరంగల్లు జిల్లా పరకాల తాలుకాలోని ఓ కుగ్రామమయిన నేరేడుపల్లిలో జన్మించి, స్నాతకోత్తర పట్టాను పొంది ఉపాధ్యాయ వృత్తిలో అక్కడే స్థిరపడినారు. ఆయన ఇదివరకే ఒక నవల, ఒక నాటిక, ఒక ఖండికల సంపుటిని అందించి రచయితగా సాహితీ లోకానికి పరిచయమయ్యారు, వరంగల్లు ఆకాశవాణి కేంద్రం ద్వారా అనేకమైన గల్పికలు, వాక్చిత్రాలు, కవితలు అనేకం అందించారు, ఆయన లోని భావుకుడు నిరంతరం కృషీవలుడే. అంతే కాదు ఆయన హాలికుడు. ఆయన నేరేడుపల్లికి ఓ చైతన్య వీచిక. శ్రీ పల్లె సీనుగారి మానసంలో నుంచి పూచిన శ్రీ కృష్ణతత్త్వ భావవీచిక "మాధవమాధుర్యము" కావ్యం. ఈ గ్రంథంలో కథ ఉన్నదంటే ఉన్నది లేదంటే లేదు. ఎందుకంటే ఇవన్నీ ఒక అనుభవ మాధుర్య వీచికలు. ఇవి అష్టపథాలుగా సాగినవి. ఎనిమిది ప్రకరణాలు ఎనిమిది సంఘటనలు. వేటికవే - అన్నిటికీ అంతస్సూత్రం మాధవుడే. ఆ మాధవునితో పరితప్తము నొందిన అనుభవ మాధుర్యం ఈ సంపుటి. ఈ సంపుటిలో అనేకమైన పాత్రలు కన్పిస్తాయి. ఆ పాత్రల ధ్యేయం మాధవుడే.

"విశ్వమోహనమైన వేణునినాదంబు సరస గంభీర గర్జనము గాగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి లలితసౌదామినీలతిక గాగ
దలచుట్టు బాగుగ దనరు పింఛపుదండ శైల భేదన శరాసనము గాగ
గరుణా కటాక్ష వీక్షణ సుధా వర్షంబు సలిలధారా ప్రవర్షంబు గాగ
జాడనే తెంచు గోపాల జనమునీంద్ర! జాతకంబుల దురవస్థ సక్కజేసి
కృష్ణమేఘంబు బహుతర కీర్తి నొప్పె! విమల బృందావనాకాశ వీథియందు"

(మహాభాగవతము -10-159)

పోతన భాగవతములో అన్నట్టుగా ఈ మాధవమాధుర్యంలో పాత్రలు కృష్ణమేఘమునందు లీనమై తమ సార్ధకతను సాధించుకొన్నాయి.ఈ పల్లె సీను కూడా ఈ మేఘచ్ఛాయలో సేద తీరి తన్మయుడైనాడు. ఇందుకతని పూర్వ పుణ్య విశేష ఫలమేమొ అని చెప్ప వచ్చును.

"మాధవ మాధుర్యం" కృష్ణ తత్త్వ ప్రధానమైనది. కృష్ణ తత్త్వమే గొప్ప సౌందర్య నిదానము. ఈ సౌందర్యము మాధుర్యమైనది. భావానికి అనుగుణమైన శబ్ద రచనను అందించిన పల్లె సీను ఈ కృతికి మాధుర్యాన్ని కలిగించారు. "భగవానునిస్మరణలోనే నిగూఢ సౌందర్యం ఉంది. కాల క్రమంగా జీవుడికే తన జన్మలోని రహస్య ఫలితం చూపించి, తదనంతర కార్యసాధనకు ఉద్యుక్తునిగావించడం ఆయన ధర్మం......వారికి లీలగా తోచి ఎంతో నిరీక్షణకు తావు కల్పిస్తూ...మననంలోనే కరిగి పొమ్మంటాడు. ఆ మననమే సౌందర్య రాశిలా ప్రజ్వరిల్లుతుందని ప్రబోధిస్తాడు. అదే లక్ష్యంగా అనుక్షణం చేసే ఈమననమే ఒక మాధుర్యాన్ని సృష్టించి మోక్షం వైపు తీసుకుపోతుంది" అని (95-96 పుటలు) ఒక చోట అంటారు పల్లెసీనుగారు.

శ్రీ పల్లె సీనుగారు ఈ రచనను వస్తు విన్యాస మాధుర్యం ప్రధానాంశం అన్నంత వరకే ఎంచుకున్నట్టు కనిపిస్తుంది. ఇది సత్యం కూడా. ఈ గ్రంథం వ్యాజంగా మనకు కూడా శ్రీ కృష్ణ భావదర్శనం చేయించి శ్రీ కృష్ణధ్యానాన్ని అనుభవింపచేసిన శ్రీ పల్లె సీనుకు, మనకు శ్రీ కృష్ణుడు శుభములను కలిగించాలని కోరుతూ ఈ కృతికి నాలుగుమాటలు వ్రాయమని ఆపేక్షతో అడిగిన శ్రీ పల్లె సీను సౌజన్యతకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను

- డా॥ టి. శ్రీరంగస్వామి

6-1-97

ఇం.నెం. 5-11-481,
విద్యారణ్యపురి
వరంగల్లు - 506 009

# 1

అది శరత్కాలము. నందగోకులం పొలిమేరల్లోనే కాదు, శీతాంశుని శ్వేత చంద్రికలు ప్రకృతంతా పరచుకున్నాయి. నిర్మలమైన ఆకాశంలో నిర్లిప్తత అలముకుంది, బిగువైన శ్వాస రాకుండా తనలోనే గాలిని పొదివి యిముడ్చుకున్నట్లున్న ప్రశాంతత నెమ్మదిగా ఆవులిస్తోంది. ప్రాణి కోటి సమస్తమూ సవ్వడిమాని గాఢసుషుప్తిలో నిమ్మళించింది. అలాంటి నిశ్శబ్దతకు తరువాత జరగబోవు కార్యం విశ్వమోహనంగా వుంటుందని కాబోలు ! కాకపోతే, ప్రకృతి విశ్వవిపంచికను మ్రోయిస్తున్న శబ్దంతో కలిసి నలునైపులా మేలుకొలిపి బాలభానుడికి ఆహ్వానం ఎందుకు------చేస్తుంది ? పుడమి గర్భం చీలుస్తూ తానెందుకుదయిస్తాడు ?

అలాగే - వంశీమోహనుడు దివ్యతేజస్సుతో మాతృమూర్తి సాన్నిధ్యం కోసం గోకులం వీధులన్నీ తిరిగి వస్తున్నాడు. ఎదురుగా వచ్చిన యశోదాదేవిని చూసి ముందుకు వంగి చరణధూళిని స్వీకరించాడు. - ఆయన్ని తృప్తిగా ఆశీర్వదించి, "నాయనా"! ఎన్ని సార్లు కనిపించినా మాతృహృదయం మళ్ళీ మళ్ళీ పిలుస్తుందయ్యా" అంది.

ఒక్క క్షణం చలించిపోయాడు మాధవుడు

కృష్ణుని రాకతో ఆమెలో కలిగిన ఆనందమే ఆమెకలా అనిపించివుంటుందేమో! ఎందుకంటే, ప్రతిక్షణం, కన్నయ్య ప్రతీక్షయే కదా ఆమెకు వూరట.

"అనురాగ మయమైన ఈ ముదుసలి వయస్సు నన్నాపిరి సలుపనీయడం

[illegible]
సైతం నేను దగ్గరి వాడినని నీనోట చెప్పించుకున్నాను గదే''! అంటున్న వంశీమోహనుడి నీలమోహన కాంతిలో శాంతిమయ దృక్కుల్లో అంతా నిష్పాక్షికతే చూసిన యశోదాదేవి తన్మయురాలైంది. ఆమె అంతరాంతరాల్లో తెలియని వాత్సల్యం ప్రవహించింది. నీరసం నిండుదనంలోకి దిగజారి, అశేష పారవశ్యంలో లయమైపోయింది. అలా కొన్ని నిముషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

కృష్ణా! " రాతిరంతా ఎక్కడ తిరిగావు? కన్నులెలా అలసి వున్నాయి చూడు' . అంటూ ఫాలభాగాన్ని అమితానురాగంతో చుంబించింది.

అమ్మా ! "నీ చల్లని ఒడిలో నిదురించినప్పుడు నాకు అలసట యేది? కార్యకారణ బంధుత్వం కనుమరుగులోనే విస్మరిస్తే యెలా ? నిండుగా వున్న నిరీక్షణలూ తిలకించాలిగా ! అందుకే తెల్లవారు తున్నప్పుడే నీ ఒడి వీడి వెళ్ళాను గదే! అంటున్న కృష్ణునిగాంచి.

"మానవ ప్రతీక్ష మనుగడ కాలవాలమై మరో మలుపు తిరిగేలోపు మరపురాని సంఘటనలెన్నో నా మనోమందిరాన ప్రతిష్టించావు కృష్ణా ! నీవు మానవాకారం ధరించిన మధురమూర్తివి. కదలలేని కావ్యాలకు కంపించే వేణురవం అందించిన కారుణ్యరూపివి. తిలకించనలవికాని ముగ్ధ సౌందర్య శోభను మలచిన మహత్తరశిల్పివి' '. అని ఏమేమో అంటున్న మాతృమూర్తి ముఖంలో సౌమ్యతను జీర్ణించుకున్న అరుణిమను చూశాడు నీలవర్ణుడు. ఆ వాక్సుధామయమైన రసాంబుధిలో ప్రతిబింబించని ఆకారంలేదు. కాని ------ఎంతకూ మరపురాని ఎప్పటికీ మరుగుపడని ఆకృతి ఒక్కరాధాదేవిదే. అది జన్మ జన్మలకీ విడదీయరాని మానసిక జ్ఞాన జనిత మనస్సంక్షోభం. అలా నిశ్శబ్దంగా జారిపోతున్న నీడలు అన్నీ ఆవిడ నుండి తృణీకృతి పొందినవే. ఆ"నీలిమ" నిండుసెలయేరులా పొంగాలని చూసిన

యదుభూషణుని నయనాలు దేవమందిర ద్వారాలై రాధాదేవి సన్నిధిని శాశ్వతంగా వుండగలవేమో ! ఈ చిహ్నములతో పొడగట్టిన ముఖబింబమును తిలకించిన తల్లియెదలో రాధ తళుక్కున మెరిసింది. జాలి ఉద్భవించింది.

అమ్మా ! ఏమిటలా యోచిస్తున్నావు నిదురిస్తున్నట్లుగా ?

హుం! ఏముంది తండ్రీ ! రాధాలోలుని పరిపూర్ణతగాక !

సిగ్గుతో కృష్ణుడు ముఖం తిప్పుకున్నాడు. క్షణం కళ్ళు మూశాడు. నిలిచివుండగానే నిదురరాగలదా కృష్ణా ! వేడుకగా వింతగా అలంకరించిన రాధిక, ఆభరణహీనయై, అవ్యాజముగ్ధ ప్రణయినియై అణువణువూ పరిశీలిస్తూ ఆ తలిరాకు జొంపములలో - అవిరళమార్గ నిరీక్షణలో నీ రూపాన్ని సంస్మరిస్తూ, ఆరాధిస్తూ ఆ తమాల వృక్షచ్ఛాయల్లో రాలేక రాలేక వస్తున్న సుఖసుషుప్త నీడుస్తూనే వుంది నాయనా ! ఇంక నీ వీడ్కోలు నా అనుభూతికి తార్కాణం కాగూడదనేముంది ? వెళ్ళి తిరిగి వేగిరముగా రమ్ము --- అనగానే---!

మందవాయు కణాసారయుతమైన సుమపరిమళాల్ని ఆఘ్రాణిస్తూ నిశ్శబ్ద సామ్రాజ్యాన్ని స్థాపించి, ఆ ప్రాంతాన్ని శుష్కభూమిగా జేసి చరచరాసాగిపోయాడు వంశీ., ఆయన వెంట యశోదాదేవి ఆశీస్సులూ వెళ్లాయి.

ఆ వేళ రాగరంజితమైన అసుర సంధ్య, రక్తారుణిమనీ నాల్గుదెసలా పరుస్తోంది. ఆ రంగును పులుముకుని వివిధ భంగిమలు ప్రదర్శిస్తోన్న యమునా నది, నిటారు తరువుల నీడబారుల్లో మెలికలు వేస్తున్న సర్పంలా వుంది. అక్కడి కల్లంత దూరాన శుచి వాటికగా, ముముక్షువుల సాయుజ్య ప్రాప్తికనువైన ప్రాంతంగా, మబ్బు తునకల్లో వెలిగిన మణిమయ కాంతుల సొగసును సృష్టించిన మురళీధరుని గోపాలక స్థావరముగా ప్రస్తుతింపబడుతున్న ఆ విమలతలమున కొన్ని మెరుగు శిలలున్నాయి.

ఆ శిలల్లో ఒకమూల అలవోకగా నీరెండలనిడివి నీడుస్తున్న జలచరహృదయుడై చేయిసాచి, "ఎవరో వెళుతున్నారు. నా పిలుపు వినిరాగలవారేనా? ఔనౌను ఆసార్థకత నాకెన్నడో అబ్బినదిగదూ! అయినా---కృష్ణుడు కాని ---లేని ప్రదేశం--ఫ్ఛ్" అని ఆగిపోయి బాధామయ స్వరంతో నందుడు వెఱ్ఱిగా నవ్వుతున్నాడు.

సందేహంలేదు అదే---! ఆ దృష్టిలో మార్పులేదు. ఆ మాధవుడు అటువైపే వెళుతున్నాడు---అది చూసి, రసగుళిక సేవించిన రోగివలెనే నందుడేదో వూరట చెందుతున్నట్టున్నాడు. ఆహా! ఎంతటి ఔదార్యం ? ఆ కమ్మని తేట హృదయం ఎంత మార్పు పొందింది? ఎంతలో తండ్రి భావనలోనికి దూసుకుపోయింది....

విశ్వవిఖ్యాతమైన ప్రణయం ఎంత తీయని ఆశల్ని ఉద్భవింపజేస్తోంది. ప్రేమను అనంతమైన ముక్కలుగా విభజించిన శక్తి యెంత పునీతమైంది. రాధా! అని తడబడలేదు కదా! తండ్రీ! అని వడి నడిచాడు నీలమోహనుడు. వేయి వేణువుల్లోంచి అనంతకోటి రవాలుత్పన్నమై, తన చుట్టూ సంగీతవాహినిని పర్వించినట్లూహించాడు నందుడు. నిర్మల నీలమేఘమొకటి శీతల స్పర్శనిచ్చుటకై పరుగెత్తి వస్తున్నట్లు భ్రమించాడు. అలా దగ్గరగా వచ్చి నందుని జూచి తండ్రీ ! అన్నాడు కృష్ణుడు.

నల్లనయ్యా! "నవాభ్యుదయ సామ్రాజ్యం నీ వల్ల నాలో స్థిరమైందయ్యా, నా రాజ్యానికధిపతివై నాకు సాయుజ్యాన్ని దర్శనీయం చేయి నాయనా"! అంటున్న నందుని ఆనందాశ్రువులు శిలపైబడి ఎగిరి పీతాంబరుని పింఛముపై దుమికాయి. ఆ చల్లని తాకిడికి చిదంబర స్వరూపగోపాలుడు శిలపై అంటి పెట్టుకున్న నందపాదాలు స్పృశించాడు. నందుని ఆనందితహస్తబంధనంలో "అనవరత వాహిని' ' లాంటి వాత్సల్యం ఎంతో సేపు ఆ లీలామానుష విగ్రహుని తడిపివేసింది. అంత

తండ్రీ! కవోష్ణ శైతల్య మిళితమైన యీ కౌగిలి కమ్మని రసధారలనే స్రవిస్తుందని ఎరుగనా? ఇంక నాపై గురిపించిన వేళ, నీ కెట్టి ఫలసిద్ధి లభించదో అది నాతనువున శూన్యమని నీకు తెలుసు గదా''! అంటూ నీలలోచనుడు నందుని కళ్ళలో తనను తాను చూసుకున్నాడు. క్షణమావహించిన నిర్లిప్తత యిరువురినీ దూర తీరాలకు మోసుకుపోయింది. అదియెరుగని ప్రకృతి అణువూ లేకపోయింది. పంచభూతములు పారుష్యమును కడిగివేసుకున్నాయి.

శిలలు పల్లవాల్లా తేలిక పడ్డాయ్!

సృష్టి తన కదలికనే మానుకుంది.

పక్షులు పరిభ్రమణమాపి, ముగ్ధ మోహనవంశీనాదం

వినబోయినట్టవాక్కయి పోయినాయ్ !

ఎటుగాంచినా ఏమరుపాటు లేని "విధి" - ఏమంటుందో తెలుసా నాయనా నందుడు చెప్పసాగాడు........

స్వామీ! నీ యాజ్ఞా బద్ధులమై చరించాలని సుఖాసక్తులైయున్న యీయనంత కోటి ప్రాణులు కూడ వేచియున్నాయని ఎరుగుము''అని, ఈ తరుణంలో నీ సమక్షమునకు నన్ను దూతగా బంపినారని, "ప్రకృతి సహితమైన విధి'' నా ముఖంగా నీకు వక్కాణించమని చెబుతోందయ్యా''.

నల్లనయ్యా ! ఈ వేళ నిన్ను జూసిన తన్మయత్వం నాలో సౌభాగ్యమూ-సంయమనమూ అతి దీర్ఘ స్థాయిలో నుండి నన్నూపిరి సలుప నీయవే! ఇదెక్కడి ఘోష నాలో ----? "ఇది నా వలన జనించినదనీ, నీవు కేవలం నిమిత్తమాత్రుడవనీ, తరువాత గేలి చేయుటకా? ఆహా! ఈ పరువము ఎంత చంచలమైనది? అదిలేని పథమేదైనా వుంటే నావంటి వారికది దుర్లభమా కృష్ణా అనగా విని దేవకీ నందనుడు

"దిగులా తండ్రీ! ఎవరు పూజ్యపాదులో, ఎవరు భోజ్యాహూతులో ఎరుగనిది కాదీ జగం. అనుగామియైనా, అనుభూతిగా మిగిలిపోయిందానికి మితమునిచ్చి నిష్క్రమించేది జగధర్మమే సుమా !

ఎక్కడ యేదినిలయమో, ఏది దేనికి ఆటపట్టో వూహించి నిర్ణయించగల హక్కు ఒక్క విధికే వుంది. " అది పరమాత్మలో ఒక భాగం" నిర్ణీతమైన పరిధిలోది నివసించదు. దాని వేగాన్నీ, మలుపునూ ఏశక్తులూ ఆటంక పరచలేవు. అలా జరిగిన నాడు దానికి నామరూపాలే వుండవు. భగవంతుడి రచనలో వస్తైక్యమూ శూన్యమవుతుంది. ఆదిమధ్యాంతాలలో ఐహికాధిపత్యమునెరపుశక్తి కుంటు పడుతుంది. అప్పుడు సృష్టి కర్తకే నీరసం యెక్కువై నిజమనే శక్తినీ, స్వయంగా తన ప్రతిభను తానే నమ్మలేని పరిస్థితీ యేర్పడవచ్చు. అందుకే యింతటి మహత్తరవైచిత్రిని అర్థం చేసుకునే యోగ్యత ప్రాణి కోటి కివ్వక, ఒక నిర్ణీతమైన జీవన కాలాన్ని యేర్పరచి, ఆ పరిధిలోనే తనను గుర్తించగలిగేంత వరకూ "సాధన" చేయమని శాసించాడు భగవంతుడు. ఆ యోగ్యత అందరికీ సాధ్యమయెలా సృజించని "కర్త' ' ఒక విధంగా పక్షపాతి అని కూడ కొందరు యోగులంటారు. "అయినా అది శుద్ధ అబద్ధం" అనడానికీ వీలు లేదు. ఎందు చేతంటే, దానికీ పూర్వజన్మకృతం కొంత తోడవుతుందనీ, ఇట్లనేక జన్మల ఫలం కూడ భగవంతుడి ఆధిపత్యం క్రిందనే నడుపబడుతుందనీ భ్రమించే మానవులు కోకొల్లలు. "యుగధర్మసంక్షేమార్థమై మంచిచెడుల కలయిక తథ్యమనే యోచన కలిగిన నాడు "పై స్వరూపం యదార్థమని నమ్మక తప్పదు. ఇంతెందుకు ? "ఏది అసాధ్యమో, ఏది నిరాకారమై నిర్విరామ కృషికి తోడ్పడగలదో దాని శక్తి అతీతం.

అదే పరమాత్మలో జరుగుతున్న సంచలనానికి ప్రతీక !

"విధి" పరమాత్మలో ఒక భాగమైనా దాని నిర్వహణలో దేవుడు సైతం ఒక్కోసారి తన ధృతిని కోల్పోతాడు". "నాకు బానిస" అని చెప్పగల ధైర్యం నిమిత్త మాత్రులకు

లేదు. అవసరం వస్తే అతి చిన్న స్థాయి నాక్రమించి విశాలత్వాన్ని త్రోసి పుచ్చగలడు. అదినేనెరిగిన సత్యమని చెప్ప పరమాత్మకూ అధికారం లేదనే చెప్పాలి''.

"నిన్ను నీవు కించ పరచుకుంటున్నావా ? నాయనా! పవిత్రీభూతమైన ఈసృష్టిలోని స్వామి చరణాలు శ్రీచరణాలై, సర్వజన పూజితమై అణువణువునా ప్రతిభాసించు తరుణంలో సాధ్యాసాధ్య విచక్షణ చేయనే నెంత వాడను''. అని నిట్టూర్చాడు నందుడు.

నల్లనయ్యా! " నీవు వేదాంతివి. నీ కర్థం కాని సమస్యలీ సృష్టిలో ఉద్భవించలేదు. ----లేవు-----అయినా------నీ అవతార విశేషం నా ముఖంగా తెలుపడం నా ధర్మం. నేనీ నిరంతర సృష్టి చక్ర పరిభ్రమణంలో ఒక చిన్న అంశాన్ని. మరో అంశం కావాలని నిరీక్షించే నా అనుయాయులకు నిర్ణీతకాల వ్యవధి మాత్రమే యివ్వగలను అనంతమనే శక్తి చాలని వాణ్ణి అందుకే నాలోని భావ సంకలనాన్ని ఒక్కొక్కటిగా చెపుతాను''. అని క్షణమూహకు తావిచ్చిన నందుని జూసిన గోపికాలోలుడు తన్ముఖముగా విన నభిలాషియైయునెను.

స్వామీ! " మీ సంభాషణముకై నిరీక్షిస్తున్నాను తెలుపుము''. అనగానే నందుడు అశ్రుపూరితుడై, "వాసుదేవా! నీవు నందకుమారుడవుగావు.దేవకీ గర్భుడవు, వసుదేవుడి ఆశల్లో నిండిపోయావు. ఇది వినజెప్ప నేనే యింత వ్యాకుల పడ, ఆయశోద బాధా తప్తురాలగును గదా ! ఇంకెన్నడయినా యీ సత్యము నీముఖానజారినా ఆమె భరించలేదుసుమా! అని విశ్వవిపంచిక తొట్రుపడ జెప్పెను.

ఇది విని యా చెంతనున్న మహీరుహములు తమ సుమబాలలను జారనివ్వలేదు నందుని కనులు రాల్చిన బిందువుల్లా ఆ తొట్రుబాటురాధాలోలుని మాత్రం పూపింది. ఆ జగన్మోహనుడు క్షణకాలం సంచలించి మానవాకృతిలో లయమై, విభిన్న వ్యూహాల్ని సృజించుకున్నాడు. అలా ఈ వార్త జీర్ణం కాక తన

స్వరూపానికో "మచ్చు తునకను" అచ్చు వేసిందాహృదయాన. కాళీయమర్దనుని కంఠాన బొంగురుపోయిన వొక సవ్వడి ప్రతిధ్వనించింది "అమ్మా"! అని.

కన్నయ్య మనసు సాధారణ మానవునిలా గొణిగింది. ఆ కృష్ణుని కనులు సరళంగా మారి, తండ్రి యిచ్చిన యీ మోయరాని బరువుకు నలిగి పోయాయి. అప్పుడొక పవిత్రమైన భావన తలయెత్తి, లీలగా తెలియని మాదకతలో అంతర్లీనమై పోయింది.

స్వామీ! అని నందుని వొడిలో నవనీతచోరుడు వొరిగిపోయాడు. ఆ వేళ విశ్వమయుని సృష్టి కావ్యమంతా నందునికి ఆమందానందంతో హారతులెత్తింది. దానికి ప్రతిగా నందుడు కన్నీరు నించాడు.

అలా కేకిపింఛం పై నుండి నందుడి కవోష్ణ కన్నీటి ధారలు జారి, నిశ్శబ్దంగా యమునలో కలిసిపోయాయి. ఆ వేళ యమున కోటి జన్మల అనుభూతిని పొంది, పునీతయై వేగాన్ని మాని మందాకినియై వర్ధిల్లినది.

విశాల జగత్తులోని సర్వమూ తనకోసం నిరీక్షిస్తోందన్న సత్యాన్ని ఆ క్షణంలో మాధవుడు గుర్తించలేకపోయాడు. మానవాకృతిలోని ఉద్రేకప్రకర్ష - కొన్ని సంఘటనలకు తలవొంచుతుందనే విషయం నందగోపాలుని పట్ల యదార్థమైంది. ఇప్పుడు శ్రీహరి, నల్లనయ్య---మురవైరిగాదు. చరాచరజగత్తుకు హితవరి మాత్రమే.

నందుని వొడిలో వున్నంత సేపూ ఆయనకు ఏ లోకమూ స్ఫురించలేదు. ఆనందమూ మాధుర్యమూ - తల్లీనమైన హాయికి తానిప్పుడు వశమైనాడు. ఆ నాటి ఆ రెండు శరీరాలకు తనివి తీరని ఆలింగనమది. ఎడారిలో నీటి బిందువు లాంటి ఆహ్లాదమది. దాని వైవిధ్యం ఏ కవికీ ప్రబోధింప సాధ్యం కాదు.

మరి కొంతసేపటికి--------!

విశ్వమంతా చలనరహితంగా వున్నట్టుంది. కాని------ ఎక్కడి నుండో మధురమైన గీతం వినిపిస్తోంది, నిశ్శబ్దం ఓ గీతంలా స్ఫురిస్తే, దాన్ని చీలుస్తూ మరోగీతం ఉత్పన్నమైంది. అది అనన్యసామాన్యమైంది. ఆ గీతం అందరూ వినలేరు. నందుని హృదయం మాత్రం దానికి శ్రుతి కలుపుతూనే వుంది అది కేవలం తనకే వినిపిస్తున్నదా! అనే సంశయం కూడా లేదాయనకి. ఆ గీతానికో మహత్తర శక్తి వుంది. ఒక్క విలయం తప్ప అన్ని లయలూ ఆ గీతాన్ని ఆశ్రయిస్తాయి. దానికీ ఓ పరమార్ధమూ ఉంది. అది కేవలం భగవానుడి సన్నిధిని చేర్చే గీతమని మాత్రమే నందునిలా వూహించిన వారికి తెలుసు. నిశ్శబ్దంలోంచి పుట్టే ధ్వనికి, ఇంతటి మహత్తు ఉందని తెలియడమూ భక్తితత్వంలో ఒక అంశమేనేమో!

మధుసూదనునిలేపి మార్గం చూపించిన నందుడు తన హృదయంలోనే మధుర గీతి నిలయ, రాధకి నమస్సులందించాడు, కళ్ళు తెరిచేలోగా కదలిపోతున్న శ్యామ సుందరుని జూచి ముగ్ధుడయ్యాడు నందుడు కొంతసేపు. ఏమా చింతన! ఏమా తలంపు! నందుడు ఆనందుడయ్యాడు. "ఆయన మేధస్సోధంలోంచి ఆనందమన్పొ యొకతె తన నీలిముసుగును సవరించుకుంటూ వొక్కొక్క మెట్టూ దిగుతూ వెళ్ళినట్లనుభూతి పొందాడు".

ఏది? "యింతసేపు పితృపరిష్వంగం చేసిన గీతస్వనం మళ్ళీ వినిపించదే! వెళుతున్న మాధవుని ఆంతర్యం ధ్వనించింది.

" ఎందుకు వినిపించదు ప్రభూ! ఆ వీణియను మీ చరణాంగుళులే ఆవేణువును మీటుతున్నప్పుడు, మీ మృదు అధరాలే పలికిస్తున్నప్పుడు, మీ హస్తాగ్రమే సవరిస్తున్నప్పుడు". ఎలా వినిపించదంటారు ప్రభూ!" "ఈ నిశ్శబ్ద నీరవ నిశీధిలో సైతమీలయ-జీర్ణమై వుందని" మాకు మీరు నేర్పిన పాఠం కాదా! అంటూ పంచభూతాలు ఘోషిస్తున్నాయి.

పల్లైసిను

ఇంతకీ ఆ గీతిక నిలయమెక్కడ? అని మీరు యిప్పుడే అన్నట్లు మా భ్రమ. అది "మీ పత్రాలింగనంలో మరిచిపోయిన మాట కదూ"! అన్నట్లు పక్షులు పలికాయి తమ భాషలో.

ఆహా! "ఆ కౌగిలి సుఖం కృష్ణస్వామికి జ్ఞాపక శక్తిని కూడ పోగొట్టింది" అంటాడు సమీరుడు మలయానిలుడై.

కూలంకషంగా సృష్టివైచిత్రినెరిగిన కృష్ణుడు. "ఓహో! నిజమే" అన్నట్లు చూశాడు.

ఒక్కొక్క లతాకుంజమునధిగమిస్తూ, తిరిగి చూడని వేగంతో వెళుతున్న మురళీధరుని చిత్తం దూదిపింజలా వుంది. ఎంత శక్తిగల అయస్కాంతత్వమో ఆయన్ని అంత బలంగా యీడ్చుకు పోతోంది. హఠాత్తుగా మాధవా! అనే పిలుపు కృష్ణుని మనో మందిరంలో మ్రోగింది. ఔను! ఆ శబ్దమే తానింతకు ముందు విన్నది. ఆ రవం కోసమే తనకీ పరుగు. నిలిచి పోయిన వంశీమోహనుడి కళ్ళు ఎదురుగా ప్రణయమూర్తియై, మహాయోగినియై తమాల వృక్షచ్ఛాయల్లో అరమోడ్పు కన్నులతో వున్న దివ్యమూర్తి రాధాదేవిని చూశాయి. నీరసించి పోయిన కళ్ళే.. మళ్ళీ.. మళ్ళీ.. నవ్వాయి.

వంశీ!------!

రాధా!------! నీ కోసం నేను సర్వప్రపంచమూ----

అదే----! మాధవా! నీ కోసం కూడ నేను సర్వమూ----

"మరిచి నిరీక్షిస్తున్నావా ?

నా జీవిత పరమార్థం నిరీక్షణే కదా వంశీ! యిందులో వున్న మాధుర్యం యింకెక్కడాలేదు. అయినా----నా నిరీక్షణకు హద్దులు లేవా స్వామీ! అంటున్న

వంశీమయీ! " నీ నిరీక్షణకు ప్రతిరూపమైన నీ హృదయవేదననెరుగని లోకమున్నదా? సర్వసంగ పరిత్యాగినివై కేవలం నా ఆరాధనలోనే కాలం గడుపుతున్నావని నేనెరుగనా''?

వంశీ ! మరి తెలిసి కూడ నాటకమాడే నిన్నేమనాలి ?

"క్షమించాననవలె''.

రాధాదేవి హృదయం ఝుల్లుమంది.

"ఆ అధికారం నాకెక్కడిది స్వామీ! అల్ప ప్రాణిని. పెద్దలతో పొత్తు కుదుర్చుకునే హక్కు నాకెక్కడుంది ప్రభూ''!

రాధ! నువ్వు కొంచెం స్థిమితంగా ఉండు నేను-------

ఈ బుజ్జగింపుల కోసం నేను నిరీక్షిస్తానా ప్రభూ! కనులారా నీ దివ్యమంగళరూపం చూసి నేను నిష్కామురాలనవుదామనుకున్నాను. నాకు నీ విచ్చిన వాటిక ఏ నాటికైనా పచ్చబడుతుందనే ఆశతో వున్నాను.

"మరి ఆశయసిద్ధి లభించేదెప్పుడు రాధ''?

"మలచబడని మమకారం రవంత నాపట్ల నీకున్నప్పుడు ఆశయసిద్ధి మాటెక్కడిదయ్యా''! మతిపోయినేనన్నానుగాని.

రాధా! నీ సన్నిధిలో నేనున్నానంటే అదెప్పుడో నీ కన్నా ముందే నాకు పోతుందనుకుంటున్నాను.

వంశీ! ఏమిటా మాటలు? రాధ గొంతు బొంగురుపోయింది. క్షణాలు నిశ్శబ్దంగా దొర్లిపోతున్నాయి. మరుగుతున్న తలపులు నిమ్మళించిన మీదట రాధ వంగి కృష్ణుని పాదధూళి స్వీకరించింది.

ప్రభూ! ఈ ధూళి యిక్కడ, యీ పరిసర ప్రాంతంలో ఎన్నాళ్ళుగానో తపస్సుచేస్తోంది. అది నోచినంతగా నేను నోచుకోలేదంటే నమ్ముతావా కృష్ణా! శాశ్వతంగా నేనలా మీ పాదాల్లో వుండగలనా?

పొరపడ్డావు---వంశీవశీ---! పొరపడ్డావు.

వంశీవశీ!-----ఆహా! ఎంత మధురమైన పిలుపు కృష్ణా!

రాధా! "ఏ సిద్ధికోసం ప్రాణి తాపత్రయ పడుతుందో, అది పొందే వరకు తృప్తిగా వుండదని వొప్పుకుంటున్నావా? ఆ చోటు చేరుకునే వరకు ప్రాణి పడవలసిన అగచాట్లన్నీ లెక్కలోకి రావు. ఈ మధ్య తానునడిచిన ప్రతి అంగుళమూ ఆ ప్రాణికో విధంగా సహకరిస్తూనే వుంటుంది. అయినా ప్రాణి తృప్తి- చేరవలసిన చోటు లభించిన తరువాతనే వూరట పడుతుంది. అలాగే నీ కోసం నేను రావాలనుకున్నప్పుడు యీ ధూళి నన్నంటవలసిందేగదా! అలాంటపుడు నారాక దీనికి మోక్షమివ్వడానికి కాదు----నీ కోసం----! అందుకే నువ్వు "వంశీవశి" వన్నాను.

స్వామీ ! ఈ ప్రణయం ఓర్వదగింది కాదు సుమా!

ఎలా కాదనగలను రాధా! యీ ప్రణయమే సృష్టికి మూలం. శాశ్వతత్వానికి చిహ్నం. అనూహ్యానికి ప్రతీక. ఆలంబనానికి పతాక.

అంతేనా స్వామీ!

అంతే రాధా! .......... అంతే

వంశీ! "మానవాతీత శక్తులెన్ని పుంజుకున్నా మలిన హృదయులకు, మోక్షమార్గం లభించడం అరుదు కదా! అలాంటిది నాకేదీ నీ మురళీనాదం? ఎక్కడ విన్నా నిండు తమస్సును ఎగదోసుకు పోవడాలే గాని ఫలిత ప్రపత్తి గానరాదే!

అందుకే నువ్వీలోకంలో బాధామయివయ్యావు రాధా! అయినా అప్పుడే ఎందుకంత నీరసపడతావు? అనుక్షణం నీ ఆరాధనతో నాలాంటి వాడే సతమతమైపోతుంటే!

చాలు క్రిష్ణా! చాలు. అభిమానించదగిన స్థాయి దాటిపోయింది. అవధులు దాటితే అగమ్యం కాక, ఏమి గోచరిస్తుందీ మృణ్మయదేహాలకు? అంతకన్నా నేను నోచుకోదగిందీ జగత్తులో లేదేమో! అనుకుంటున్నాను.

అదే పొరపాటు. "విశ్వం ఒక సౌందర్యవాటిక. అక్కడ కుసుమించే ప్రతీ కుసుమం పూజ్యనీయం. అనుకోకుండా భగవత్పూజకు త్రెంచుకుపోయే పరిమళసుమాలు మాత్రమే పూజార్హత గలవనుకోవడం తప్పు. మిగిలినవాటి వూహకూడ ఎలా వుండాలో తెలుసా? రాబోయే స్వామి పూజకు శుద్ధ పరిమళాన్నందివ్వగల అవకాశం తమకే వుందని ఎదురుతెన్నులు చూడాలి. అలా నిరీక్షిస్తున్నప్పుడు ఎప్పుడో ఒకప్పుడు వాటికీ వంతు రాక తప్పదు. ఒక వేళ తప్పినా, వాని నిరీక్షణ స్వామి పూదోటలోనే గడిచిందనే తృప్తి చెందాలి. అలా చెందని నాడు కూడ వాని నిరీక్షణ కొక ఫలితం వుంటుంది. అదీ భగవానుడి విశ్వతోముఖ బంధుత్వం. సుమజీవనం సంపూర్ణతనొందినదనే సిద్ధి భగవానుడు తప్పక యిస్తాడు''. అలాగే నీవు ఆ తోటలో నిరీక్షిస్తున్న కుసుమానివి. రాలిపోయేముందు నువ్వుపొందే నిరాశ సైతం భగవానుడికి కళ్ళకు కట్టినట్లుంటుంది'

అంతేనా ప్రభూ!

అంతే------- అదే సిద్ధి కోసం నా నిరంతర సాధన! కాని

మోహనవంశీ! నాదొక చిన్న అనుమానం. "అనుక్షణం నువ్వు నా కళ్ళ ముందున్న తరువాత నేను నిరీక్షిస్తున్నానని ఎలా చెప్పగలవు''?

అదిగో! ఆ అనుభూతే నీకు కలగాలి. దానితోనే నీ వంశీకి సంతోషం. అందులోనే నీ పూజ్యతకు జీవం వుంది. అది పొందే భాగ్యం నీకు దప్ప అన్యులకు

సాధ్యం కాదు రాధా! అయితే "మనం" అనబడే బాంధవ్యాన్ని యీ లోకం గుర్తించాలంటే చాలా కాలం పడుతుందేమో!

అదెలా వున్నా ఫరవాలేదు కృష్ణా! ఆత్మ విశుద్ధ స్వరూపిణియై నిలువగలిగినట్లు మనం తెలుసుకుంటే లోకం కూర్చిన "తలంపు"తో పనిలేదు.

పాత్రల పవిత్రత సామాన్యునకర్థమయే దశలో గడవడం, ఆదర్శానికవసరం రాధా! అదే లేకుంటే కావ్యకథావిశిష్టతేముంది?

ప్చ్! "యదార్థం కూడ యాచించ వలసిందేనా భగవాన్! నాకూ నిద్రగుళికలిస్తున్నారు". సన్నగా నవ్వింది రాధ. ఆ నవ్వులో ఆశించినంత వేదాంత సారం గ్రహించాడు కృష్ణుడు.

రాధా! దీని కన్నా ముందు నీకొక విషయం తెలియాలి. అదేమంటే విజ్ఞులకతీత శక్తులివ్వడం సృష్టి కర్త ధర్మం. విజ్ఞులన్నాక అతీత శక్తులేమిటి? అంటావేమో? " ఆ శక్తులు నిజ జీవితంలో తారసపడి, వాటి స్వభావం విజయ స్వరూపంగా తెలిసినప్పుడే విజ్ఞత బయట పడుతుంది. దానినే సామాన్యులు "అదృష్టం" అనీ, "సమయస్ఫూర్తి' ' అనీ అంటారు. సుగంధం అన్నాక అది ఎక్కడున్నా పోదు, అంతకన్నా అమిత శక్తిలో పెడితే, ప్రస్తుతం మరిపిస్తుందేమోకాని దాని నైజం పోదు. సాయుజ్యాభిలాషులు దీనిని అతి సులభ స్థాయిలో గ్రహించి త్రోసివేస్తారు. అక్కడే భగవతత్వానికీ, లేమికీ సంధి విడిపోతుంది. ఇది యెరిగి చరించడం సన్యాసుల లక్షణం. మహాభోగులకిది అందుబాటులో వుండక పోవడానికి కారణం వారి చాంచల్యమే అవుతుంది". అంటూ ముగించాడు వంశీ.

కొన్ని క్షణాల కాలం రాధ చలనం లేకుండా వుండి పోయింది. ఆ తరువాత వంశీ! ఈ మోహనరవళిలో తాదాత్మ్యం చెందుతున్ననాకు ......... విశ్వవిపంచికపై

ఏవేవో శ్రుతులు సరిచేసి, అంతా సంగీతమయం చేయాలనిపిస్తోంది. మహత్తర వేదాధ్యయన కావ్యమేదో విరచిస్తున్నట్లుగా వుంది. ఇదెక్కడి అనుభూతి ప్రభూ!

" పరిపూర్ణంగా యిది నీకు అర్థమయిందన్నావు అనుభూతి పొందావు. కాని అనంతంలో అణువు మాత్రమే నీకు అర్థమయింది, నీలోని మూర్తిమత్వం ఎంతో నీకు తెలియదు. అది నాకు తెలిసిందెంతో నీవెరుగవు" అయినా ఒక్క మాటలో చెబుతాను. విశ్వానికి ప్రథమం సౌందర్యం దానికి నాందీస్త్రీ మూర్తి. ఆ సౌందర్యం అనేక రూపాల్లో దృష్టాంతం. అదినీలో సమగ్రం.

వంశీ----!

అందుకే!

కృష్ణా! నల్లనయ్యా! ----ఇంక చెప్పకు నాకు భరించే వోపిక లేదు. ఈ విశ్వం అంతా నన్ను భావించే తీరు ఎలా వున్నాసరే! నీ దృష్టిలో నేను "బాధామయి"గానే మిగిలిపోవాలి అంతే---!

"తథాస్తు! అన్నాడు కృష్ణుడు అర్థనిమీలిత నేత్రుడై,

ఈ వరం చాలు వంశీ! చాలు ----చాలు అంటూ రాధ శూన్యంలోకి చూస్తోంది కాని అది శూన్యం కాదు. అంతటా వంశీ మోహనుడి రూపమే వుంది, ఆ రూపానికి ఎన్ని మూర్తులో తమ చేతులెత్తి యాచిస్తున్నాయి, కాని భగవానుడి చేతులు రాధనే ఆహ్వానిస్తున్నాయి. ప్రశాంతమైన ఆస్వామి కౌగిలిలో రాధాదేవి వొదిగి పోయింది. మధుర స్వప్నమొకటి మంజుల రవాన్ని తడుముకుంటోంది.

నీడబారుల్లో నిర్మల హృదయుడైన మాధవుడూ సంచరించారు" అని కాలం తృప్తిగా శ్వాస పీల్చుకుంది.

xxxxxxx

ఉద్ధవా! ఎవరి కోసమో ఆతురత? నేను మాత్రం నీ కోసం ఎప్పటి నుండో వెదుకుతున్నాను.

కృష్ణా ఇదెక్కడి స్తోత్రం? రాధాదేవి సాన్నిధ్యమహిమ కదూ! అదేమోగాని నేను నీకోసం----!

" నాకోసమా! రావడం! హహ్హహ్హా! నీ నేర్పు నాకు తెలియనిది కాదు" "అవును ప్రభూ! నిజం మీకు అతీతం కాదు చిలిపితనం మాత్రమే".

అదిగో! ఆ మాటే మళ్ళీ అనొద్దన్నాను.

చిత్తం. అక్కడే నేను అన్నదానికి అర్థం గోచరిస్తుంది కృష్ణా! మీరు దాచినా దానంతటదే బయల్పడుతుంది----ఏమోబాబు! మీ సృష్టికి నేను తటస్థంగా వుండడమే మంచిది.

అదిసరే గాని, అమ్మ మీ కోసం చూస్తోంది.

అదేమిటి! ఇందాక నువ్వు నా కోసం చూస్తున్నానన్నావుగా!

"స్వామి ఎదుట మాటలు తడబడకుండా వుండడం కూడ ఒక వరమే" ప్రభూ! అలాంటి జాడ్యమేదో నన్ను అలముకున్నట్టుంది. అందుకే చెప్పలేకపోయాను.

ఉద్ధవా! "నీవు విరాగిణివైన స్త్రీ మూర్తివేనేమో! శృంగారం సైతం నీలో పుంజుకుని నన్ను ఉక్కిరిబిక్కిరి చేసేంత శక్తి నీకు పూర్వ జన్మం నుంచే సంక్రమించి వుంటుందని

నా అనుమానం" అంటూ చిరునవ్వు నవ్వాడు కృష్ణుడు. ఉద్ధవుడామాటలకు సిగ్గుపడ్డాడు, ఇరువురూ కలిసి నగర వీధుల గుండా వెళ్లిపోయారు.

ఆ వేళ ఉద్ధవుడి జీవం శృంగారంలో మిళితమై గత జన్మసార్థకతకే కృష్ణుని కాలాన ఉద్భవించి వుంటుందనీ, దానివలన పరిపూర్ణతబొంది తనూ ఒక కృష్ణాంగంగా పరిగణించబడడంతోనే ముక్తి లభిస్తుందనీ తలపోసింది. అందుకే మూగగా నీలినయనుని జూడగానే సిగ్గుపడిందేమో!

కాని తను స్త్రీ కాదుగా! అయినా తన దృష్టిలో----కృష్ణుని పొందు గోరువారిలో స్త్రీల కన్నా పురుషుల సంఖ్యేయెక్కువ. అది కారణంగా కూడా మాధవుడి ప్రేమానురాగతత్వం, అస్ఖలిత బ్రహ్మచర్య ప్రభావం, యోగమాయా స్వరూపం, ధార్మిక పరిపాలితం వరుసగా భక్తి ఆలయానికి సోపానములై ముక్తిగంట నాశ్రయింపజేస్తాయి. ఆధ్వని సంరంభంలో భక్తుని ఆంతర్యం పులకిస్తుంది,అంత వరకూ దైవ సుకూల్యం కోసం పోరాడవలసిందే----ప్----! ప్రాకులాడవలసిందే!

అలాగే ఉద్ధవుడు ఆలోచిస్తూ యశోదాదేవి భవన ప్రాంగణంలో అడుగుపెట్టాడు కృష్ణుడితో. ఆ మీదట అనిర్వచనీయమైన అనురాగం, ఆత్మీయతా పెనవేసుకొని అమ్మ హృదయం నుండి ప్రవహించాయి

కృష్ణుడూ తనూ కలిసి ఆ వాత్సల్యామృతాన్ని తృప్తిగా ఆస్వాదించారు.

×××××××

# 2

మురళీధరుని కన్న తల్లి దేవకీ దేవి. అందరు పిల్లలయెడ ఆమె తల్లిగా చూపించే వాత్సల్యం అనిర్వచనీయం. అలాగే సాత్యకిపై కూడ అమితానురాగం కలిగివుండటే ఆశ్చర్యం కాదు. గిరిధరుని చేష్టలు విని ముగ్ధురాలై సాత్యకిని మరిచిపోయింది దేవకీ దేవి. కారణం ఆ దేవదేవుని లీలా మహాత్మ్యమని వేరుగా చెప్పనక్కరలేదు.

ఒకరోజు వెన్న దొంగ తమ్ముని దోడ్కొని అమ్మ దగ్గరకు వచ్చాడు. విశ్వమోహనుడైన తన నందనుని జూచి తన్మయురాలయ్యెను, క్షణంలో సాత్యకిపై యించుక తీక్షణదృష్టిని ప్రదర్శించిందాయమ. దాని అర్థం నీలిమయుడిట్టే గ్రహించాడు. తనలాగే సాత్యకి కూడ తరచుగా కంటపడడంలేదని కాబోలు ఆమె వదనం చిన్నబోయింది.

క్షణం స్తబ్దుడయ్యాడు మాధవుడు.

అమ్మా! "యమునా తీరంలో బలదేవునికై వెదకి బడలికచే నిటు వచ్చితిమి. ఏక్షణంలో భక్తులు, అనుయాయులు ఏమి నెపము వేయుదురో యను భయమేగాదా! నాబాధ నీవెరుగవా? తమ్ముని నావెంట నుంచుకొన తప్పేమి? కాగా నా గూర్చిన చింతతో తమ్ముని గోపింప నెంత భావ్యము? అట్లయిన నీ సన్నిధినేమరకయుందుము" అన్నాడు నీరుగారిపోతూ.

వద్దునాయనా! భరించలేని హాయిలో చిరుకోపం యే స్త్రీ కైనా సహజమయ్యా! తల్లి ప్రేమ వున్న ప్రతి చోటా ఈ యదార్థం గుర్తించదగినదనే మార్గమే శ్రేష్టమని

ఇప్పుడు మా ముందు నువ్వు స్త్రీవి కావుగదమ్మా! "బ్రహ్మాండం ధరించిన జగన్మాతవు. భవిష్యత్తు చూపించిన భాగ్యదేవతవు". కృష్ణుడు నిదానంగా అన్నాడు.

మౌనంగా కళ్ళుమూసి రెండు ఆనందాశ్రువులు రాల్చింది దేవకీదేవి.

సాత్యకి–ఆ బిందువులను తుడిచి, "దేవకీనందనుడి తప్పేమీ లేదమ్మా"! నేనే ఆయన చెలిమి కాంక్షించి వెంటవెళ్ళాను. అయినా అది నా తప్పంటావామ్మా! అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"కృష్ణుడి చెలిమి నాశించని ప్రాణిలో భగ్న జ్వాలాయుతమైన ఆలోచనలుంటాయని తెలీదా" నాయనా!

అమ్మా! అభ్యసనకు తొలియక్షర ప్రదాతవు నీవేకదమ్మా! ఇంతెందుకూ! నీ తరువాతే మేమూ, మా స్వరూపము. నీకుమించి మాకేమీ వుండతగదు. వున్నా అది స్వల్పం.

నాయనా! సాత్యకీ, "చారవగా నాగర్భంలో దూరినంత మాత్రమే గాని నల్లనయ్య ముద్దు ముచ్చటలు నేను చూడనే లేదయ్యా! ఆ భాగ్యం ఒక్క యశోదకే దక్కింది". అంటుండగానే నీరజనేత్రుడు వికసించిన వదనంతో తల్లిపాదాలు స్పృశించి తన రెండు చేతులతో ఆమె ముఖాన్ని తడిమినాడు.

ఇరువురినీ ఆప్యాయంగా కౌగలించుకుంది దేవకీ దేవి. జన్మించినది మొదలు ధ్యానమే తప్ప తనయుని ఆలింగనమే అంతగా యెరుగని యా తల్లి హృదయం ఆనందాబ్ధిలో తేలియాడింది. అలా కొన్ని రోజుల కొకమారు పుత్రులజూచే అవకాశం ఆయమకు దక్కిందే కాని నీలవర్ణుడు వెంటనుండు వాడుకాడు. అప్పటికే తన "ధ్యానం" పరాకాష్ఠనంది, జగత్తునంతా జయించి నంతటి తృప్తినిచ్చేది. ఆమె అనురాగ సుధ జారి, వాత్సల్య క్షేత్ర పొలిమేరల్లో ప్రవహిస్తూండేది. దిగ్వలయ శాసకురాలిగా అనుభూతిని పొందే ఆ తల్లిమమతార్ద్ర హృదయం సర్వప్రాణులకూ

నివాస యోగ్యమైనదే. ఆమె జగన్నుత. ఆమె హోర్పు సర్వేశ్వరదత్తం. అందువల్లే భగవానుడిని సైతం పుత్రుడిగా పొంది, పెంచకుండా దూరంగా వుండి, పరిపూర్ణురాలై అమందానందాన్ని పొందుతోందంటే విచిత్రమేముంటుంది?

"జనని" అంటే అర్థం యేమిటో చెప్పే స్థోమత లేకున్నా, "అదొక విశాల భవిష్యత్తుపై విశ్వాసాన్ని కల్పించే శక్తి" అని మాత్రం చెప్పగలం. జననం మొదలు వార్ధక్యం చివరంటా ప్రత్యక్ష–పరోక్షంగా పాదుకుని వెంటవుండి పదిలమని ప్రబోధించే స్వభావం గలది. మరో విధంగా చెప్పాలంటే "జనని జీవన సంజీవని". అర్ద్రత, స్పందనాదులకు మూలస్థానం. విశ్వవిజేతయను సుదీర్ఘాశీర్వాదసంకేతం. దివ్యలోక సముచిత స్వరూప వాత్సల్య ప్రదాయిని. జీవన ధ్వని జనిత స్థానబీజం. అన్ని ధ్వనులీ జననీ మాధుర్య స్వరపేటిక నుండే ఉద్భవించి సంతాన సంగీతానికొక లయ సృష్టించుననుట నిర్వివాదాంశము".అంతటి మహత్తర మూర్తి కౌగిట ఎంతసేపున్నా పుత్రులకెలా తనివి తీరుతుంది?

నెమ్మదిగా కౌగిలి విడిచి, యదుకులభూషణా, గోకులనందనా, గోపాలా! గోవర్ధన గిరిధారీ! నీ యోగ మాయలెన్న మేమతి సామాన్యులము అంటూ చుబుకాన్ని తాకింది తల్లి.

ఆ వేళ తమాల వృక్షాలలో విశ్రాంతి పొందుతున్న మందమారుతం రివ్వున వీచి ఆ ముప్వురి తలలపై పూల వర్షం కురిపించింది. తరువాత.....మాతృమూర్తి సెలవు నిరీక్షణలో వారికి చాలా కాలం పట్టింది.

కొన్ని క్షణాల వరకు ఆ ప్రాంతమంతా నిశ్శబ్దం ఆవరించింది. చివరికి వెన్నుని మురళీరవంకోసం వేలాది భక్తులువేచివున్నారనే భావం స్పష్టపరచింది తల్లి. తమ్మునితో సహావెళ్ళి పోయాడు శ్రీకృష్ణుడు. అనురాగపు గాలులు వారి వెంటనే నిట్టూర్పులు విడుస్తూ వెళ్ళినై.

ఆ పిమ్మట యామె "వాసుదేవుని వాసి నలుమూలలా ప్రసరించాలని మరే దేవుడికో మొక్కుక  ె. ఆ దేవుడు ఆమె జ్ఞానానికందని స్థాయిలో వుంటాడేమో!"తెలిసినా తెలీక పో  ా ముందుతరాలకు భక్తి ప్రపత్తుల రీతిని ప్రస్ఫుటింప జేయ గల్గిందని' ' విశ్వం–  సతవదనంతో చూసి శ్వాసించింది.

దిగంతములు దినకరుని మ్రింగి, అరుణరేఖల్ని సంతరించుకుని ఆవులించడంతో వెలికి వచ్చినగాలిలో నిర్లిప్తమైన "నిశి" కూడా వుంది.

xxxxxxx

ఆ రాత్రి ఆలస్యంగా వచ్చిన చంద్రుడు చీకటితో రాజీ కుదుర్చుకున్నాడల్లేవుంది. బహుళ పంచమి మరచిపోయి బరువుగా నిట్టూరుస్తున్నాడు. చీకటి వికటంగా నవ్వుతున్నట్లుంది. సమీరుడు సంజ్ఞచేయగా ఎండుటాకులు శబ్దం చేస్తూ స్థలం మారుస్తున్నాయి. లయాన్వితమైన సవ్వడి యేదో ఆ తరుబారుల్లో నివసిస్తున్నట్లుంది. అర్థరాత్రి ప్రపంచమంతా గాఢనిద్రలోనున్నప్పటికీ, మోక్షసాధకులు సర్వదా నివాసముంటున్న స్థావరాలలో కళ్ళు తెరిచి కూడ ధ్యాన నిమగ్నతలో నున్నట్లు ఆ చీకటి స్ఫురింపజేస్తున్నది.

ఆ వేళ వసుదేవుడి స్థిరత్వం జన రంజకంగా పల్లవిస్తోంది. అంతచీకటిలోనూ తను నిర్మించిన ఆశ్రమ పాకవేపు నెమ్మదిగా నడుస్తున్నాడు. అక్కడున్న చిన్న చిన్న క్రిమికీటకాదులాయనకి స్వాగతం పలుకుతున్నట్లు ముందుకువస్తున్నాయి. ఆ పాక ముందు సన్నని వెలుగు నొకటి ప్రశాంతతని తెలియపరుస్తోంది. ఆ వెలుగుకు తోడైన పంచమినాటి చంద్రుని చిరువెలుగులు క్రమంగా మరుగైపోయాయి. అస్పష్టంగా అక్కడ కనిపించే వస్తు సామాగ్రిలో చిరుచాపవొకటి. నిశ్శబ్దంగా ఆ చాపవేసుకుని కూర్చున్నాడు వసుదేవుడు.

భగవదారాధనలో వున్నపుడు, కొందరి ప్రవృత్తులు భిన్నరూపంలో వుంటాయి. ఏకాగ్రచిత్తమై యుండు మహనీయత కొందరికి సాధ్యమైతే,మరికొందరికి పరిసరాన్వయత్వం వుపయోగకరమవుతుంది.

"చీకటి వెలుగులను బాపుకొను నిమిత్తం–ఇహ పరాదులను బొందు నిమిత్తం –

ప్రస్తుతం మరచి, ఊర్ధ్వాశయ సిద్ధికై ప్రాకులాడ్డం, దైవికమైన స్వరూపం తాలూకు ఛాయలకై గతానుగత జీవన సంస్మరణం చేయడం.... ఈ ఆరాధనకు మూలమై వుంటుంది.

వసుదేవసుతుడైన కృష్ణుని నామాంతరమందే "నల్లని" అనే అర్థమున్నది. కృష్ణ స్వరూపం కూడ అంతే. అలాంటి నిశిలోనే.....ఏచిన్న వెలుగైనా ప్రకాశవంతమనే నమ్మకం వసుదేవునికి మెండు. అది... ఆది విష్ణువుకు తెలిసే కాబోలు నీరస (చీకటి) హృదయారాధకుడైన వసుదేవుని గర్భమందు దివ్యతేజస్సును ప్రభవింపజేసి, అదే నిశిలో ఆ నీరస హృదయాంతర మందే (చెరసాల) జన్మించాడు. అనంతమైన తృప్తిని ఆ తల్లిదండ్రులకు ప్రసాదించాడు.

వసుదేవుడి గత జీవితం అంతా సుఖమయం. వెన్నెల మిళితం. కంస ప్రతిజ్ఞకు నలిగి మాత్రమే కృష్ణపక్షం అవలంబించాడు. "భయంకర జీమూతమైనా భరించగలను గాని క్రూరజన కృద్ధ స్వరూపం చూడలేను" అంటాడు. అదే అలవాటుగా "ప్రశాంత ధ్యాన మందిరం" వొకటి యమునా తీరంలో నిర్మించుకున్నాడు. కృష్ణస్వామి జన్మించిన శ్రావణమాసమును గూర్చి, ఆ శుభమాసమున తనకు కలిగిన ఆనందమును గూర్చి స్మరిస్తూ కాలం వెళ్ళమారుస్తూ వుంటాడు.

ఈ రోజు చిరు చాపలో కూర్చుండగానే ఆ ప్రదేశమంతా ప్రశాంతంగా కనిపించింది. చీకటి వేళ ఒక ప్రాణి మరొక జీవమును కనీసం చూడలేని వేళయది.

పూచిక పుల్ల కూడ శబ్దం చేయడంలేదు. అప్పుడప్పుడూ వీస్తున్న గాలి తాకిడికి చెట్ల కొమ్మలు రాచుకుని అనుమానించదగినంత శబ్దం మాత్రమే చేస్తున్నాయి.

వసుదేవుడి హృదయం దివ్యలోకాల్లో విహరిస్తోంది. అంత చీకటిలోనూ గాఢత్వం–ఏమీలేనట్లు కళ్ళు తెరచి చూస్తున్నాడు. వికారమైన స్వరూపమేమీ లేదాయన కనుచూపులో కనిపిస్తున్నంతమేర. అనిర్వచనీయమైన ఆలోచనా ప్రవంతి తెగక ఊర్ధ్వముఖసాయుజ్యానికి జీవం పోయడానికి పెనుగులాడుతూ ప్రవహిస్తూనే వుందొక వైపు. సుస్థిర శాంతి సౌభాగ్యం వైపు నిలకడసారించి, అర్థాంతర సౌమనస్యాన్ని సృజించబోతోంది మరోవైపు. మహనీయమైన తేజస్విత శోభ తాలూకు రమణీయతను వెదకుతున్నాడు. కుటీరం వెలుపల సన్నని అడుగుల సవ్వడి వినిపించగానే ఒక్క క్షణం తన ఆలోచనలని కట్టువడజేశాడు వసుదేవుడు.

శాంతి రథమాపి, కర్తవ్యాన్ని ప్రబోధించే విధి (దేవత) లా, శబ్దయోగం కోసం ఉవ్విళ్ళూరే మహాకడలిలోని హోరుని నిండుగా మోస్తూ, వస్తున్న లక్ష్మీదేవిలా ప్రత్యక్షమైంది దేవకీదేవి!

గాఢ నిశీథిలో గరువాలనడలతో చేరువవుతున్న ధర్మపత్నిని చూసిన వసుదేవుడు "ఇంత ఆలస్యమైందేమిటని' ప్రశ్నించాడు.

"భువనమోహనుడి భాషణం శాసించింది ప్రభూ"! అంటూ దగ్గరగా వచ్చి ఆసీనురాలయింది.

ధన్యురాలవుదేవీ! అంటూ నెమ్మదిగా నేలపై శయనించాడు.

"అది మీ ప్రసాదం ప్రభూ! అందుకు నేను అర్హురాలనగుట వలననే నా జన్మ చరితార్థమైనది. నేనాశించిన ఇహ పర సౌఖ్యానికి మీ సాన్నిధ్యం, కన్నయ్య జననం మూలమయ్యాయంటే, అది నా పూర్వ పుణ్యఫలమని మీరు మాత్రం నమ్మలేరా" ! అంది తన్మయురాలై.

"నమ్మలేనంత మూర్ఖత్వం నాలో నివసించడం లేదు దేవీ! యోగ మాయా స్వరూపం భిన్నమై, మనకు శాశ్వతానందాన్ని ప్రసాదించడంతోనే మన బ్రతుకుల్లో వెన్నెల కురిసింది''. అంటూ శూన్యంలోకి చూశాడు.

నిశ్శబ్ద నిశీథిలోంచి ఏదో తెలియని నిండుదనం వారిపై ఆవరించి కొంతకాలం ఆచేతనుల్ని చేసింది. నెమ్మదిగా లేచి పతిదేవుని పాదాల చెంత కొంత శుద్ధజలం వుంచి తిరిగి వెళ్ళి ఆమె పడకపై వాలింది దేవకీదేవి.

సమాధిలోంచి లేచిన యోగివలె ఆ జలాన్ని సేవించి, తిరిగి సమాధ్యవస్థలో లీనమయ్యాడు వసుదేవుడు.

xxxxxxx

నాడు శ్రావణ బహుళ షష్టి. కృష్ణ జనన దినోత్సవం యింకా రెండు రోజులుంది. ముయ్యేడు వారములు పూరించిన మాసం, మూర్తీభవించిన స్వామి స్వరూపసందర్శన కాలాన్ని సమీపిస్తోంది. పుణ్యదంపతులైన దేవకీ వసుదేవుల ప్రవాసకాల జీవనం పరామర్శల్లోకి అడుగిడింది. అందరూ ఆ దంపతుల వ్రతదీక్షను కొనియాడుతూనే వున్నారు.

సుప్రభాతమున లేత సూర్యకిరణాలు కుటీరంలోకి తొంగి చూచిన వెంటనే లేచి కాలకృత్యములు తీర్చుకొనుటకై యమునకు వెళ్ళాడు వసుదేవుడు. రాత్రంతా మాధవుని మననంలో నున్న దేవకీదేవి లేచి స్నానాదికములు ముగించుకుని బాలార్కునికి శుద్ధ ఆచమనీయం సమర్పించి తులసీ చెట్టుకు నీళ్ళు పోస్తోంది.

నెమ్మదిగా కృష్ణుడు అటువైపు వచ్చాడు.

"ఏమిటి నాయనా! మరొక జాము నిదురించక యింత వుదయమే ఏమిటి నీ రాచకార్యము''? అంటూ ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"నీ దగ్గరకు రావడమూ రాచకార్యమే అవుతుందామ్మా"!

కాదు. అలా ఎప్పుడూకాదు! కాని సాయంవేళంతా నీదగ్గరే వుంటిని గదా! మరియిప్పుడే నాకు జెప్పని పనంటూ యేమొచ్చిందని" నా సందేహం.

కృష్ణుని ముఖంలో గంభీరత చోటుచేసుకుంది.

"ఈ మధ్య యెందుకోగాని, నీ సమక్షంలో ఎన్ని మాటలు జెప్పినా, నాకేదో కొరతగానే వుందమ్మా! అందుకని ఏదో మరిచిపోయి వుంటాననే" ఆలోచిస్తున్నాను.

పిచ్చి తండ్రీ!"లోకాన్ని పిచ్చిగా జేసి నాముందు నువ్వు పిచ్చివాడివవుతున్నావు'

'. అంటూ సన్నగా నవ్వి లోపలికి తీసుకువెళ్ళింది. కాని ఆమె మనస్సు అనేక విధాలా పోతోంది. "తన కుమారుడన్నది నిజమేనేమో! అమితంగా ఆరాధించే వాళ్ళూ, తనకోసం తపస్సు చేసే వాళ్ళుంటే....భగవానుడికెలా ప్రాపిరాడుతుంది? ఏదో వెలితిగా....ఎక్కడో పూర్తిచేయని పని..... ముక్తకంఠంతో పిలుస్తున్నట్లుగా వుంటుంది. పైగా యీ మాసమంతా ఆత్మీయుల మూగఘోషేకదా వినిపించేది! అందుకే తన చిట్టి తండ్రి యిప్పుడేం చేయాలో తోచక ఎవరినీ అడగలేక అమ్మ సలహా కావాలని వచ్చివుంటాడు! యశోదముందు చిలిపిచేష్టల చిన్నయ్యేగాని, నాముందు తనకెందుకింత భక్తిభావం! తండ్రి యెడ ఏమిటీ గౌరవం!.....అహో! మేము తరించాము". అంటూ యింకా ఆలోచిస్తూ నడుస్తోంది. కృష్ణుడు ఆమెను వెంబడిస్తూనే, రాత్రంతా చెరగకుండా వున్న పడకను గమనించి కొంత విస్తుపోయి చూస్తుండగా...

"ఏమిటి కృష్ణా! నువ్వడగవలసిందన్నట్లు చూసింది.

అమ్మా! "ఈ పడకపై పితృదేవులు నిదురించరా? వేసినది వేసినట్లుండ గానే తెల్లవారినట్లుందేమిటి?

"ఆ పడక అలాగే వుంటుందయ్యా! అదిగో! ఆమూల చల్లని గాలికి వేయబడిన చాపపైనే విశ్రమించడం ఆయనకు అలవాటు".

"కారణం యేమిటన్నట్లు" చూశాడు కృష్ణుడు.

"నీ తండ్రిగారు ప్రతియేడూ ఈ మాసంరోజులు యీ కుటీరంలోనే గడుపుతారు. అన్ని యేళ్ళూ నీకు కార్యనిర్వహణతోనే సరిపోయింది. ప్రస్తుతం నీవు పరచింతన యోచించదగిన వయస్కుడవు. అలాగే నీ కర్తవ్యం నిన్నిటకు తీసుకు రావడంతో వచ్చావు. అది నీ ధర్మం కూడ".

ఆ మాటలు విన్న నీలమోహనుడి చెవులు మరింత ఆసక్తిని కనబరిచాయి. ముందుకు వంగి చెప్పమన్నట్లు చూశాడు.

ఈ కుటీరం నీ శిశుప్రాయంనాడు నిర్మించింది. దీని పవిత్రత కేవలం ఆరాధకులకే తెలుస్తుంది. పరిపూర్ణ నిర్మలత్వం యీ కుటీరంలోనే నివసిస్తోందంటే రాధాదేవి దయవల్లే ననక తప్పదు. ఆమెయే యీ పాక స్థాపనకు మూలం. మా నిర్వ్యాజ భక్తి ప్రపత్తులకు, నాటి ఆ పసిపాప తీయని పలుకులే మేలు కొలుపులు. ఈ మాసంలో తప్ప మిగిలిన కాలమంతా దీనిపోషణ, సంరక్షణ భారం తనదే.

"ఈ వొక్కనెల మాత్రం ఎందుకు కాకూడదు"?

"అది కేవలం నా అభ్యర్థన. నీ తండ్రి కోరిక కూడ. ఈ వాటికలో నాసేవలో వారికి నిండుదనం లభిస్తుంది. వారి ధ్యాన తత్పరతను ఆరాధిస్తూ నేనూ యిక్కడే వుంటాను. ఆ ధ్యానంలో ఆయన నిదురిస్తారో, సమాధిలో నుంటారో ఆ దేవదేవుడెరుగు. ప్రశాంతమైన రాత్రులంటే ఆయన ప్రేమించినంతగా నేను ప్రేమించలేక పోయానేమో! అనిపిస్తుంది. కనీసం తోడుగానైనా వుంటే నేనూ వారి అనుగామి నౌతాననే నమ్మకంతో వుంటాను. ఆ నైర్మల్య ప్రభావ "ధ్యానం" ఆ పడకనలాగే వుంచుతోందంటే విచిత్రమేముంది నాయనా"!

కృష్ణుడి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

అమ్మా!"మీ ఏకాగ్రత ఏ నోము కోసమో అడగకుండా వుండలేక పోతున్నానమ్మా"! అంటూ అమ్మవొడిలోకి వొదిగాడు కృష్ణుడు.

కృష్ణుడి వీపునిమురుతూ కొంతసేపు మౌనంగా వుండిపోయింది. అమ్మ. ఆ తరువాత....

కృష్ణా!"ప్రభవించిన దివ్య తేజస్సు పరిపూర్ణతపొందే దాకా మా కాయువు ప్రసాదించమని కాబోలు" అంటూ శూన్యంలోకి చూసింది.

ఆమాటలో స్ఫురించిన భావం, అమ్మఒడిలోనే ఆగిపోయింది.

"మీ నిర్ణయం పూర్ణత్వం పొందు తుందని మీకు నమ్మకముందామ్మా"?

"మాలో యే వొక్కరికది సన్నగిల్లినట్లు తోచినా, భరించలేము తండ్రీ! పతి–కృషికర్త. సతి–సహకారిణి. కృతార్థత పతిదీ సతిదీను. చేసేది ఆయనైనా, అనుభవించేది యిద్దరం. చేయించేది ఆత్మీయత అనే లీల మాత్రమే. ఆ లీలా ప్రభావం ప్రపంచంలోని అందరు తల్లిదండ్రులకూ చిక్కదు.అందరికీ అస్పష్టంగా తెలియని యేదో మహత్తర గంభీర స్వభావ శక్తి గల రూపం మాత్రమే కనబడుతుంది. అందరిలా కాక, మేము ప్రత్యక్ష శక్తి ఆరాధకులం. అది ఎదుట వుండగనే నివాళులివ్వలేకపోతున్నాం. ఆ నివాళులు అందించి పరిపూర్ణత నొందేందుకు యీ జీవితమంతా తాపత్రయ పడుతూండడమే మా ధ్యేయం". అనగానే ఆమె ఒడినుండి లేచిన కృష్ణుడు.

"ధ్యేయం కాదు ధ్యానం. కృతక రూపేణా అర్చన. అందుకున్న ఫలితాన్ని అనుభవించలేని ఆవేదన. అల్లిక గల ప్రతి సమస్యనీ త్రెంచుకోలేని క్షోభ. అదేనామ్మా! మీరు చేస్తున్న ధ్యానం"? కొంచెం ఆవేశంగానే అన్నాడు కృష్ణుడు.

ముకుందా! అలా నిద్రలేకున్నా నీ కళ్ళు ఎట్టని జీరని సంతరించుకో లేవు తండ్రీ! కృతకమైన.... అనాయాచితమైన బాధనీకున్నట్లుంది. అది యే స్థల ప్రభావమో తెలియదు నీకిప్పుడు. లే...లేచి వెళ్ళు. అలా బయట నిలబడి యీ జగత్తునొక్క సారి పరీక్షించు. నువ్వు భ్రమించింది నా వొడిలోనే. ఇది వీడితే బంధుజన (ప్రాణి) కోటికి అభయ హస్తమీయలేని నీ మనస్సెంత క్షోభిస్తుందో చూడు". అంటూ అశరీరవాణిలా పలికింది మాతృమూర్తి.

ఎంతో సేపు మౌనంగా వుండి పోయాడు కృష్ణుడు. కొంతసేపటికి లేచి అమ్మ కళ్ళల్లోకి చూశాడు. అయితే అమ్మా! "నీ ఒడి ప్రభావమే నన్నింత ముగ్ధుడిగా.... చేసిందంటే..నమ్మమంటావా"? అంటూ గంభీరముద్ర వహించాడు కృష్ణుడు. ఆమెకళ్ళకతడు గంభీరంగా కనిపించలేదు. పసివాడుగా అడిగినట్లనిపించింది.

జగన్నుతుడు అమ్మవొడిలో ఆరు సంవత్సరాల బాలుడేననిపిస్తున్నాడని ఆశ్చర్యం కూడ వేసిందామెకి. కృష్ణుడి రెండు చేతులూ పట్టుకుని;

అంతే నాయనా! అంతే. ఆనంద భాష్పాలు రాల్చింది. ఆ నీటి బిందువులు నాలుగు వంశీమోహనుడి అరచేతిలో పడి పెద్దబిందువయ్యాయి. ఆ బిందువులో జననీ జనకులు, అభిమానులు, ఆరాధకులు, అర్భకులు, యోగులు,జితకర్ములు, కాంతలు కనిపిస్తున్నారు కృష్ణుడికి. ఎవరెవరెంతటి దశను వాంఛిస్తున్నారో వారికది లభించక సర్వమూ మరచి, చేతులెత్తి ధ్యాన నిమగ్నులై వున్నట్లు గోచరించింది. అందరూ తనవైపే ఏదో అడుగుదామని చూస్తున్నట్లనిపించింది. ఆమధ్యలోంచే వస్తున్నారు ఉద్ధవుడూ, అక్రూరుడూ, నందుడూ, నర్మదా,కుబ్జా, నళినీ అందరూ. ఆ ముందరనే వొక శిలావేదికపై కూర్చుండి రాధాదేవి వారినందరినీ నివారిస్తోంది. తనేదో శ్రమించి తయారుచేసిన కృష్ణస్వామి విగ్రహం వారికి చూపిస్తోంది. ఆ

విగ్రహంలో ఆముష్మిక సాధన తాలూకు అభయ హస్తం వొకటి తొంగి చూస్తోంది. రాధాదేవి ఆ విగ్రహం వ్రేళ్ళలో మోహనవంశిని దూర్చి నూతన పుష్ప పరాగరేణువులని ముఖము నుండి పాదముల దాకా అలదుతోంది. అందరూ అక్కడే నిలబడిపోయి, పిమ్మట మోకరిల్లారు. అంతే ఆ "ధ్యానం" ఇక మరువలేక సాగిలబడిన శిల్పాల వలె వుండిపోయారు.

ఆ వేళ వెలుగూ, చీకటి, గాలీ, ఎండ ఏమీ వాళ్ళనంటినట్లు లేదు. మరోకొంత సేపట్లోనే రాధ కూడ చలన రహితంగానే వుండిపోయింది.... అంతా స్థంభించి పోయినట్లయింది. ఆ దృశ్యాన్ని చూసిన కృష్ణుడు అమ్మా! అని పిలిచాడు అర్థమైనట్లు. అమె అప్పటికే లేచి వెళ్ళి చాలా సేపైంది. భర్త రాకకు ఆహ్వానం చేబుతోంది. కృష్ణుడు కూడ ఎదురుగా వెళ్ళి తండ్రిని చూసి అలాగే నిలబడిపోయాడు.

"కృష్ణా! రానాయనా"! అని నోరారా పిలిచి కౌగిలించుకున్నాడు తండ్రి. ఆ కౌగిలిలో విశ్వమోహనగానం ఆయన స్పష్టంగా విన్నాడు. విశ్వజితుడై అనంతంలో అందరికన్నా దూరంగా వెళ్ళి కలిసి పోతున్నట్లు భ్రమించాడు. మాటలు రాని ఆయన ముఖం వికసించే వుంది. ఆనందాశ్రువులు అనగినితములై ఆయన చెక్కిలి పైనుండి జారి నల్లనయ్యవీపును తడుపుతున్నాయి. వున్నట్లుండి కృష్ణుడు, "తండ్రీ! నాదొక చిన్న కోరిక; మన్నిస్తారా"? అంటూ పసివాడులా అడిగాడు.

వసుదేవుని విభ్రాంతమనసును గమనించిన దేవకీదేవి నిర్మలంగా నవ్వింది. కృష్ణుడు యిరువురి పాదధూళి స్వీకరించిన మీదట,

"మీ సాన్నిధ్యమున నేనీ మాసముండుటకు అనుమతించండి"! అంటూ జాలిగా చూశాడు మోహనుడు. ఆ దంపతులు పరవశులై కృష్ణా! అని మాత్రమే అనగలిగారు. ఆ రోజు వారివద్దనున్న కృష్ణుని జూచి సర్వమూ తమలోనే నివసిస్తోన్నంతగా

నాటి నుండి మురళీధరుని మనోతనువు ప్రఫుల్లనీల కాంతిలో వెలుగుతూ, తమకతి చేరువలో వున్నట్లు ఆ కుటీర పరిసర ప్రాంతమందున్న ప్రాణులు ఆనందించాయి. ఒక్క పరిసరమేమిటి? అనిర్వచనీయ శక్తి యేదో తమకత్యంత సమీపంలో నున్నట్లు జగత్తంతా జగన్నాధుని సంస్మరించింది.

ఉన్నట్లుండి కృష్ణుడు ఇన్నాళ్ళు తను సామాన్యుడుగా తిరిగిన మధురఘడియలు ఒక్కొక్కటే దృశ్యమై విశ్వానికి తనెవరు? తనవల్ల జరగవలసినదీ జరుగుతున్నదీ యేమిటి? అంటూ ఆత్మ అంతరాత్మల సమ్మేళనంలో ఆవిరౌతున్నట్లున్న శ్వాసను పీల్చ నారంభించాడు.

నిజం! తనెవరూ కాను. జీవించవలసిన ప్రాణికి తోడు మాత్రమే, తోడు లేని ప్రాణి విగతాశతో కృంగుతుంది, "తోడు" అంటే అర్థం అనంతం. అనంతంలో యీ ప్రకృతీ వొకటి. ప్రకృతిలో పంచభూతాలున్నాయి. స్వేచ్ఛగా వానిలో ఆత్మీయత కల్పిస్తే జీవి నివాసయోగ్యంగా భ్రమిస్తుంది. అదీ, వాని సహకారం లేని నాడు అనంతుని అవసరం లేనట్లే. దాని కోసం శ్రమించడానికి స్థిత ప్రజ్ఞత్వం, యోచన, ఆరాధన రూపేణా కొన్ని ప్రక్రియలుంటాయి. వాని సంరంభంలో అంతరాత్మ ఉద్భవించి సాయుజ్య స్వరూపం వైపు పరుగెత్తిస్తుంది. చివరికది నిర్మలంగా యీ "తోడు"లో కలిసి భగవంతుడు అనే వూతతో అత్యంత ఉన్నత స్థాయిని చేరుకుంటుంది. ఆ స్థాయికి చేరుకునేందుకు చేయవలసిన సాధనకు ప్రథమ సోపానం "ధ్యానం".

ధ్యాన నిమగ్నతలో యీ జగం తరిస్తోంది. తెలియని శక్తి కోసం పరుగులు పెడుతోంది. ఆ పరుగు......నా వరకే వచ్చి ఆగిపోతోంది. అందుకే నేను నేనుగా గమనించాలి. నేనలా గమనించకపోతే అంతా శూన్యంగా, కదలని వస్తువులా ఈ విశ్వం స్థంభిస్తుంది. ఈ స్థంభన అలాగే వుంటే యుగసమాప్తి అవుతుందేమో! "అలా ఎప్పుడూ జరగకూడదు". అంటూ గట్టిగా గొణిగాడు.

చివరి మాటలు స్పష్టంగా దేవకీదేవి విన్నది, దగ్గరగా వచ్చి, కృష్ణా! నీకూ సమాధ్యవస్థయేమిటి నాయనా! పసివాడివి'' అంటూ తలనిమిరి కూర్చోబెట్టింది. ఆ మాటలోని భావగాంభీర్యం యిప్పట్లో కృష్ణుడు గుర్తించే స్థితిలో లేడు.

సమాధ్యవస్థకాదమ్మా! సంజ్ఞాప్రబోధం. ధ్యానజనిత సమావేశపు జీవగీత'', నా కంతా అర్థమయింది. నన్ను కదలించక కొన్ని రోజులిలాగే ఉండనీయమ్మా' '! అని జాలిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

అలాగే నాయనా! అంటూ లోపలికెళ్ళిపోయింది దేవకీదేవి.

తల్లిదండ్రుల సాన్నిధ్య మహిమ నెమరువేస్తూ లోకానికీ, తనకూ వున్న విస్మయాన్వితత్వం యోచిస్తూ చాలాసేపు అలాగే కూర్చొని వుండిపోయాడు మురళీధరుడు.

xxxxxxx

# 3

ప్రఖ్యాత వైణవికుడుగా పేరుపొందిన గోపాలుడు తన మురళీగానంతో ఆబాలగోపాలాన్ని పరవశుల్ని చేస్తున్న రోజులవి. గోవర్ధనగిరి పరిసరాల్లో తన చెలికాండ్రతో తిరుగుతున్న సమయంలో అనేక విధాలుగా రాక్షసులు పీడించారు. బలదేవాదుల సహకారంతో అందరినీ సంహరించాడు కృష్ణుడు. ఎవరెవరెలా సహకరించినా, నిమిత్తమాత్రులమనే ఆలోచన గోకులంలో ఎవరికీ కలిగినట్లులేదు. చివరంటా భగవానుడిని, అతని లీలావలయంలో - - - తలమునకలు వేస్తూ - - తన్మయత్వం పొందుతూ ఒక్కొక్కరూ సహధ్యాయిగా సంగడీడుగా, బంధువుగా మాత్రమే భావించారు. ఆ భావనలో ప్రతిబింబించిన యే ఘట్టమూ వారిని దివ్యత్వంలోకి లాగలేకపోయింది. ఏ క్షణాన యెలాంటి దుష్టజనాపాయమున్నా, కృష్ణయ్య శౌర్య పరాక్రమంతో అంతరించిపోతోంది. అందువల్లనే - - - గుండెల మీద చేతులు వేసుకొని హాయిగా నిద్రిస్తున్నారు యాదవులు.

"ఆదివిష్ణు" స్వరూపం - అవతరించిన పుణ్య భూమియందు ఉద్భవించడమే ముక్తిదాయకము. ఇక ప్రత్యక్ష లీలా సందర్శనంతో జనం, విజయపరంపరలను రాశిబోసిందంటే ఆశ్చర్యంలేదు. బలదేవాది యాదవ వీరుల బాహుబల తీక్షణతకిచ్చిన సందర్భసహిత గౌరవ, ఆదరభావమే శ్రీకృష్ణుని మానవతా మూర్తిగా మలచింది. గత స్మృతులు మరచి, యుగకర్తవ్యమే తమదిగా ప్రజలు ఆయనకి తోడ్పడుతున్నారు. ఆ తోడు ననుసరిస్తూనే భగవానుడు తనకేమీ తెలియనట్లున్నాడు. అపారమైన తన దృష్టిలో శ్రద్ధగా నీతి - అవినీతుల కలయిక కొక నిర్ణీత స్థానమిచ్చి పోషిస్తున్నాడు. అదే తన ధర్మంగా పరిగణించి, రాబోవు యుగాలు జీవం నింపుకునేలా చేశాడు. అదే ఆయన కనీస కర్తవ్యం అని కలియుగాన ప్రతి మానవుడూ వూహించకుంటే - యింక పురాణాలకున్న విలువలో రేణువు కూడ అర్థం చేసుకోనట్లే భావించబడుతుంది.

ఆ రోజు మదనగోపాలుడు మధురానగరం నుండి గోకులం వీథులగుండా ఆనందోత్సాహాల మధ్య వెలిగిపోతూ వస్తున్నాడు. కంసుని యిక్కట్టులకులోనై నలిగిపోయిన ప్రజానీకం వెంటరాగా జయజయనినాదముల మధ్య మందహాసవదనుడై ఉన్నతాసనం పై అధిరోహించి వున్నాడు కృష్ణుడు. ఆనాటి ఆ ముఖంలోని గంభీరతలో యేదో తెలియని బృహత్తర బాధ్యత వున్నట్లుంది. జనసందోహమంతా స్వర్గవైభవ దృశ్యం చూసినట్లానందిస్తున్నారు. మరో వైపు.

“తపతీ !తపతీ! అదిగో ఆ వైపు చూశావుటే, అదేదో వీధి భాగవతం ప్రదర్శనలా వుంది. గుంపులుగా వెళుతున్నారు జనం”. అని అటు వైపే చూస్తోంది నళిని.

“అబ్బ! యేమిటోనే. ఎగదోసుకుపోతున్నారు. మనమూ వెళదామా! నాకు ముచ్చటగా వుంది ఆ కోలాహలం చూడాలని----! అరెరే! అదేదో రథంలా వుందే’ ’. అంటూ తపతి జడ అల్లుకుంటోంది.

“ఏమిటే! అలా చూస్తున్నారు వెర్రివాళ్ళలా, కదలండీ! కరువు తీరా కమనీయమూర్తిని దర్శించి వద్దాం“. కొంగు సవరించుకుంటూనే వెళుతోంది నర్మద.

“గొణుగుతూ గుమ్మంలో మాయలాడిన క్రిష్ణయ్య పెద్ద మహరాజును చంపిన వీరుడయ్యాడటే” ముక్కుపై వ్రేలుంచుకుని అబ్బురం ప్రకటిస్తో అవిటి దానిలా పరుగెత్తుతోంది నీరజ.

మంగళప్రదమైన గానం యేదో నల్లనయ్య రాక నిమిత్తం సిద్దపరుస్తోన్నట్లు కొందరు గోపికలూ గోపాలురు తమ పాటల్లోని పల్లవిని మళ్ళీ మళ్ళీ యెత్తి గొంతులు సవరించుకుంటున్నారు. ఆ పాటల్లోని మాధుర్యం కేవలం వంశీమోహనుడి మురళీరవంలో చోటు చేసుకున్నట్టిదే. గోకులం అల్లరినంతా ఆదమరచి వింటే, భువన మోహన సంగీతానికి శ్రుతులూ, లయాలూ మేళవించిన ఉత్సవగీత సంరంభంలాగే తోస్తుంది. ఇంక ఆ కోలాహలం ---!

"కుంకంభరిణలేదే రాణీ!" ఒక గోపిక అదుర్దా.

"హారతి పళ్ళెం, అమ్మా నిన్న నీకిచ్చాను కాదుటే" మరో గోపకన్నె ఆతురత.

"చూశావా అత్తా! యీ పొగడపూలు యిప్పటి దాకా వున్నాయిగా! ఇంతలోనే యేమయినట్లు"? ఒక భామిని నీరసం.

" ఆతెల్లచీర నేను కట్టుకుంటానే మొద్దూ"! అక్కయ్య కంగారు.

"ఆహ! మహా చెప్పొచ్చావులే. నా దుద్దులు కాజేసి." ఒక చెల్లాయి అక్కను

మరోవైపు - - - "మేతవేసినా - - - మనం మళ్ళీ వచ్చాకే మేస్తాయి సుమా' '! ఒక తాతయ్య తన మనవడికి కృష్ణయ్య మహిమ చెబుతున్నాడు. ప్రక్కనే వుండి వింటున్న పాలేరు నీలయ్య పరవశించిపోతున్నాడు.

మంగళ వాయిద్యాలు దగ్గరవుతున్నా కొలది గోవులు, తాతయ్య తమ స్థానాన్నే మరచి చూస్తున్నారు- - అలా చూస్తే - - -! గోకులవాసుల జననాంతర సంబంధం యెలా వున్నా, పెద్దవాళ్ళు చిన్నవాళ్ళకన్నా అతిసుకుమారంగా వున్నట్లు అనుభూతి పొందడంలో యదార్థం లేకపోలేదు. కారణం ఆ స్థలం విశిష్టత.

జన్మ సౌందర్యం ఆ భూమిలో తాదాత్మ్యం చెందిన మీదటనే అవతరించి వుంటుంది. జననానికి పూర్వం శాపగ్రస్తులు, వరప్రభావితులు ప్రేత రూపంలో ఆ భూమిలో సంచరిస్తూ మదన గోపాలుని అవతారం కోసం తపస్సు చేసి వుంటారు. అప్పటి దాకా ఆ ప్రేత మూర్తులు అదే రూపంలో వెఱ్ఱివాళ్ళుగా వెక్కుతూ, వేడి శ్వాసతో జీవించివుంటారు. వీరి రాకతో రాధాదేవి (ప్రేతత్వంలోనే) అర్ధనిమీలితనేత్రాలతో, చిరునవ్వులతో యమునా నదీతీరంలో మహాయోగినిలా వుంటూ ప్రేతాత్మలకి సహనం అభ్యసింపజేస్తో వుంటుంది. "కొన్ని యుగాలకు పూర్వమే యీ యదువంశ స్థాపన జరగవలసి వున్నట్లు ఆ నీలిమయుడు ఆవేదన

తువునెరుగని వేళలు సైతం వనశోభనలరింపజేస్తో, ఆపుణ్య భూమిని సదా శ్యామలంగా ఎలా వుంచుతాయి ?

జగన్నాధుడికి తెలియకుండానే నిర్ణీతమైన ఆ స్థలంలో అంతటి రమ్యత త్రం ఎలా వస్తుంది ? కొన్ని తరాలుగా ఆ పుణ్య స్థలి అనేక జన్మలకాటపట్టై డానికేనేమో అలా వుంది. అనేక ప్రాణులు "అక్కడ తాము ఎత్తవలసిన కోసం పరితపించే వారికి శుష్కజ్ఞానం" ప్రసాదించి భగవానుడు మరింత వధ చేశాడని కొందరు భావిస్తే, అలాంటి జ్ఞానం వల్లే "నిరీక్షణ" అలవడిందని నిరీక్షణలోనే ఇహపరాదుల కతీతమైన మహోన్నత స్థానమునందుండ గుతున్నామనీ మరి కొందరూహించారు. ఆపై విచారిస్తే - - - గోపభామినులు భవించే ప్రత్యక్ష సుఖం కంటే, అప్రత్యక్షంగానే జన్మ నిరీక్షణలో తరించి భారనిపిస్తుందొక్కొక్కప్పుడు. ఫలిత జ్ఞానుల ఆవేదనకూ, మూర్ఖత్వం స్కృతమైన ముముక్షువుల సంతతి వారికీ సమగ్ర విచక్షణాభేదం లేకుండానే, ్రరం వయోభేధ నిర్ణయంగావించుకుని కాట్లాడుకుంటూంటే, పరిణతి పొందిన ప్రాణీ వీరి "మానసిక రుగ్మత"కి నవ్వుకుంటుంది కూడా. అనాదిగా వీరి ం సృష్టించబడిన యీ పవిత్ర స్థలంలో కృష్ణ జన్మకై ఎదిరిచూస్తున్న వారి రకే "రుగ్మత" అని మరో పేరున్నట్లు తెలుస్తోంది. కాకపోతే, ఆవిర్భవించిన రోహలతో, అమలిన శృంగార చేష్టలతో గోపికలు అనుక్షణం మాధవుని పొందునే ంకు ఆకాంక్షిస్తారు ? కనుమరుగైనంతలోనే ఎందుకు కటకట పడతారు ? పకే తమ పుట్టుకకి పూర్వమున్న రుగ్మతలో ఏదో కొంత భాగం యిప్పుడూ మన్నట్లుంది. శారీరకంగా వారెన్ని జబ్బులకు గురియై భాదపడినా, మానసికమైన నలో భక్తితో కొలిచే లక్ష్య సాధకుడైన మాధవుని సంస్మరణంతో మాత్రం ందిస్తారనేది నిర్వివాదాంశం. ఇది గత జన్మలోనే ఉగ్గుపాలతో నేర్చుకోబడి వణువునా శరీరంలో యిమిడి పోయింది. అది ఆ జన్మకే గాకుండా తరువాత

యాదవాన్వయంలో పరిపూర్ణంగా ప్రతిబింబించాలని కోరుకున్న వరమై వుంటుంది. మరో మాట కొస్తే......!

రామావతారం కేవలం కొందరు హితులకే పరిమితం. ఆనాటి ప్రజలకు ఉత్తమ పరిపాలకుడుగా, మాత్రమే పరిచితుడు. మునిమానస వాసుడగు శ్రీరాముడు భక్తజనాభిరాముడై, లోక కంటక సంహారుడై అరివీరభయంకరత్వం చూపి, మునులూ, దేవతలు సంతసించగా తన అవతార విశేషమును తెలియపరిచినవాడు. గత జన్మవాసన వలన పొందగలిగిన మోక్షకాముకులు శబరి, గుహుడు, అహల్య మొదలైనవారు. అందుకే రామచరితం పుణ్యమూ పురుషార్థమూనూ- - - మరి.

శ్రీ కృష్ణావతారంలో తన పరివారమంతా బంధు, భక్త, భవిష్యత్ స్వరూపాలే. వారి కోసం తను చేయవలసిన మాయలన్నీ చేస్తున్నాడు. అభిమానించదగిన రీతులన్నీ సమూలంగా కదిలించి అద్వైత రూపులుగా మలిచాడు. అందుకే "పరమభాగవతోత్తముడైన కృష్ణస్వామి చేష్టలు విశ్వసనీయములై వుండుటలోనే సంశయములు కలుగజేస్తాయి" అంటారు కొందరు అర్థోపాసకులు. ఆయన పసితనం నాటి చేష్టలలో అద్భుతం తప్ప ఆధిక్యత కనిపించదు. ఆయన లీలలు చూసి, విని తన్మయులు కావలసిందే కాని ఆశ్చర్యపడడంలో అర్థం లేదు. ప్రయోగసిద్ధమైన ఆయన భావచాంచల్యంలో భక్తి రసమూ వుంది. శృంగార లాస్యమూ వుంది. అంతటి మహత్తుగల లీలలు అర్థం చేసుకోగలవారు, చేసుకున్న వారూ వ్రేపల్లెలో ఎంతమంది ? అంటే నిరుత్తరులయ్యే వారి సంఖ్య హెచ్చు. పిచ్చి గాని అర్థమే అయితే లీలామానుష విగ్రహుడెలా అవుతాడు ?అంతకంతకూ అందని మూర్తిలా ఎలా ఉంటాడు ?

అదే -- అదే అర్థం కాదు. అర్థమే అయితే మానవతా శక్తీ, ప్రాణి తత్వమూ ఏదో తెలియని ఆనందంతో కలిసిపోతుండేది. ఆ ఆనందం అసాధ్యమెలా అవుతుందని వెర్రిగా కూడా చూస్తారు. తత్ఫలితంగా జీవులు అనంతమైన సృష్టిలో

అణువైనా అర్థం కాలేదనే పిచ్చిలో బడి కొంత కాలానికి బరువైన దుగ్మ్రతకి లొంగి కర్తవ్యతా విమూఢులైపోతారు. "మానవ జాతి మామూలు జన్మ" అన్నాక ఉత్తరార్థ ప్రాయంలో ప్రతి వొక్కరికీ యీ దశ తప్పదు. అందుకే ఈ దశనధిగమించి నిండుదనం సాధించిననాడు భగవానుడు అతిచేరువై సంసారవిముక్తులైన వారికి స్వర్గ ద్వారాలు చూపుతాడు. ఆ ద్వారంలో నిన్ను నీవు చూసుకొని నీ పనికి ప్రతిఫలం నీవే పొందుతావు. అంతే - --!

×××××××

ఊరేగింపు వచ్చి నందుని యింటిముందు ఆగింది. తమ గమ్యమిదేనన్నట్లు అందరూ తృప్తిగా నిట్టూర్చారు. బలదేవాదులు కూడా అక్కడి విశాలమైన ప్రదేశంలో కొంత సేదదీర్చుకున్న వారివలె వున్నారు. అంతకుముందే ఆ ప్రదేశమంతా, ఏదో గొప్ప సమావేశమున కాయత్త పరచిన దానివలె అలంకరించబడి వుంది. పల్లె జనమంతా అక్కడే పోగయ్యారు. మహారాజావారి నిండు సభలోవలె జనం ఆ బహిఃప్రదేశంలో శబ్దం చేయకుండా వున్నారు.

శ్రీకృష్ణుడు అందరివైపూ ఓసారి చూసి ఏదో చెప్పాలని చూస్తున్నాడు. అప్పుడే ఆయన దృష్టి గోపకాంతల పైకి పోయింది. వాళ్లలో ఏదో వెలితి, ఆరాటం అది వాళ్లలో ఎందుకుందో, ఎలాంటి కళతో ఆ వెలితి పరిపూర్ణమవుతుందో - - - తోచడం లేదు, మానసికంగా అనుభవించే తృప్తికే కృష్ణతత్వంలో చోటుందిగదా! శారీరకంగా కౌగిలింతకు మించిన వాంఛ మరేమైనా వుందా ! లేదు అలా వుంటుందనుకోవడం పొరపాటు. అస్ఖలిత బ్రహ్మచర్యంలో పండిన భగవతత్వమే యుగాన్ని నడిపిస్తోంది. దీనినర్థం చేసుకుని పూర్ణజ్ఞానియైన వారెవరు? - - - మలినం లేని కృష్ణ సాంగత్య మహిమనెరిగిన వారెందరున్నారు? రాధను వూహామాత్రంగా వదిలివేస్తే మిగిలిన వారి సంఖ్య అతి స్వల్పమని చెప్పవచ్చు. ఆ కళకేదో గోచరించినట్టువాడు కృష్ణుడు

ఆ! అవును! - - - [illegible] ప్రధానమైన కుబ్జ గోచరించింది. ఆమె ఔన్నత్యంలో ప్రస్ఫుటించిన నిండుదనం, నడతలో కనిపించిన నైర్మల్యం, సంభాషణలో వెలిబుచ్చిన తేటదనం - - - మూగగా అనుభవించిన వేదనలోనే అర్థం కాగలదు. కుబ్జలోని విశిష్టత మరే గొల్ల భామినిలోనూ కనిపించదేమో - - ! అవును - - - ఎలా కనిపిస్తుంది ? భగవానుడికి భక్తులపై వున్న స్థిర సంకల్ప శక్తి మరెవ్వరి పైననో ఎందుకుంటుంది గనక? - - - ఉన్నా- - - అనుభవైక వేద్యమనునదెందరికి- -? ఆ శక్తి మోయగల భక్తి ప్రపత్తులుంటే, వానిసాధనలో స్వామి స్వరూపం దర్శనీయం కాదనే నమ్మకం ద్వాపర యుగంలోనే లేదు. "అర్చకులు అంగలారిస్తే - ఆరాధకుల కోసం ఆనందుడు అవిటివాడవుతాడట. " అన్నట్లు బలదేవాదుల సమక్షంలో కుబ్జ యేపాటిది ? అదే అనంతుని మహిమ. "కోరిన వారి దరినుండక, కోరని వారెవరో" అని చూసే కోతి సందడి గలవాడు. అందుకే అందరూ ఆయన్ని అల్లరివాడని అంటుంటారు కాబోలు.

కార్యనిర్వాహకత్వం కోసమే గోకులవాసులందరూమూకుమ్మడిగా జన్మయెత్తినారనేది యదార్థమే. జన్మయెత్తిన ప్రతియాదవుడూ యేదోవొక కార్య సాధన చేయనున్నట్లు వారి ముఖాల్లోనే ప్రస్ఫుటిస్తుంది. కంసుని మరణానంతరమే కొంత కర్తవ్యం నెరవేర్చుకున్నట్లుగా అనుభూతిని పొందారు. ఆ మీదట యింకేం కావాలో తోచని యాదవులు కృష్ణుని మొహంలోకి చూడసాగారు. నిమిత్త మాత్రులైన వారి యాలోచనకు యేదో తెలియని రుగ్మత అలముకున్నట్లుంది. ఉన్నట్లుండి రౌహిణేయుడు, కృష్ణా ! "తదుపరి కర్తవ్యమేమిటని" ప్రశ్నించాడు.

"అన్నయ్యా ! కర్తవ్యం ముందుగా విచారించవలసినన్ని రాచకార్యాలేమున్నాయి గనక ? తప్పని సరి అనిపించే పని యేదైనా వుంటే అది అనాయాచితంగా యెదురుపడుతూనే వుంది. విధిగా నెరవేరుస్తూనే వున్నాం. చాణూర ముష్టిక వధానంతరం యే మహాయుద్ధాలు లేవనే ఆలోచన యాదవుల్లో యిదివరకే

వున్నట్లుంది. ఆ మీద కంస వధ కూడా జరిగింది. యుగ పరిసమాప్తం కావలసిన అవసరం నీదాకాయెందుకు ? ఒక సమస్యగా దాన్ని మీ ముందెలా వుంచగలను''?

అందరిలోనూ యేదో తెలియని శూన్యం గమనించిన కృష్ణుడు, యీ మాటలతో వోదార్చ ప్రయత్నించగా - - - యాదవులందరూ విస్ఫారిత నేత్రాలతో తిలకించసాగారు. "యుగపరిసమాప్తం" అంటే దిక్కుతోచని వారి పరిస్థితి వర్ణనాతీతం. మాటలు రాక, కృష్ణయ్యా ! అని మాత్రం మూలిగారు.

" మా అంతర్యం గమనించే ముందు, మా జన్మ సాఫల్యం యింకెంత ధూరమో యోచిస్తే బావుంటుందేమో"! యాదవుల్లో ఒకడైన అనిలుడు అన్నాడు.

ఆ యోచన కూడా నాకే అప్పగిస్తున్నావా అనిలా ? అనంతమైన సాధనకు అణుమాత్రమైనా సాధ్యం కాలేని ఈ తరుణంలో మీ కేమని వివరించగలను?

మీరే అలా అంటే మా వంటి వారికీ కాయం సరిపోతుందా ప్రభూ !

అది తరువాత విషయం. నాగూర్చిన చింతనతోనే మీ "ఐహిక బంధం" పరిసమాప్తమైపోతోంది. అందుకు నా కర్తవ్యమేమొ నువ్వు యోచించి వుంటే - - - అడుగడుగునా నేను జాగ్రత్తలో వుండవలసిన విధానంలోని అంతరార్థం నీకు స్పష్టంగా బోధపడి వుండేది. నీలాగే అందరూ ఆయవస్థలో సంచరించినట్లు అనుభూతి - - -నాకే అణు మాత్రం కలిగినా చాలునయ్యా ! ఇంక మీ అనుమానం తీరుతుందనేందుకు వేరు నిదర్శనం చూపించవలసిన అవసరం లేకపోయేది. "పరం' ' అర్థం కావడానికే "ఇహ" బంధాన్ని మరింత పటిష్టపరిచినట్లు మీరు నా సన్నిధిలో సంచరిస్తున్నారు. అదే నాకు తృప్తి అంటూ అభయహస్తం చూపాడు కృష్ణుడు.

ఆ వేళ సంధ్యారుణ కిరణాలు మరింత ఎరుపెక్కినాయి. ఆ ప్రాంతమంతా లేతదనం యెరుగని అరుణిమను పూసుకుంది. ప్రశాంతమైన వారి ముఖాలో

తెలియని గంభీరత అలముకుంది. ఆశ్రమంలోని యోగుల్లా అందరూ తన్మయులై కూర్చుండి వున్నారు. మరో క్షణంలో అనిలుడు "ధన్యులం ప్రభూ! మా నిజ దేహం మీ నీడనే నిమ్మళిస్తే - - - మా నమ్మకం మరో స్థాయి ముందుకు నడుస్తుందనే ఆశ. కాకపోతే కథ చూపిన కమ్మదనం కోసం కబళం వదులుకున్న వెర్రి కాముకుల్లా అవుతుంది మా బ్రతుకు " అన్నాడు అందరి అభిప్రాయం యిదేనన్నట్లుగా.

క్షణం నిర్విణ్ణుడయ్యాడు కృష్ణుడు.

అనిలునిలో యింతటి అంతరార్థ జ్ఞానశక్తి నివసిస్తోందని వూహించ లేకపోయాడు. రాబోయే జీవితానికి అసంతృప్తి ప్రతిపాదన నా ముఖంగా యెప్పుడైనా జారితేనే తానీ విధంగా అని వుంటాడని భావించి, - - నిరుత్తరుడై కళ్ళు మూసుకున్నాడు కృష్ణుడు.

అనిలుని భుజం తట్టిన బలరాముడు గంభీర వదనంతో "అనుభవిస్తున్న వారికి అనుభవం లేనిదేదో తెలియడం. ఆ క్షణంలో కష్టమే'' మరి. అప్రయోజకుడైన రాజు ముందున్న అసాధారణ సైనికుడు కూడ శత్రురాజుతో బలి అవుతున్నాడు. అపజయమని తెలిసి కూడ పక్షం మార్చుకోని ప్రభు భక్తి అతడిలో వుంది. అది గమనించని రాజు కళ్ళుండీ అంధుడే అనబడుతాడు. ఒక వేళ గమనించితే - - రాజు గుణమే మారుతుంది. ధర్మం ఉద్భవిస్తుంది - - - సుభిక్షం తాండవిస్తుంది - - - ఓటమి శూన్యమవుతుంది - - - బాధలు మృగ్యమవుతాయి. ఇందొకరినొకరు అనుమానిస్తే మిగిలేది మనోవేదన. తత్ఫలితంగా రుగ్మత చోటు చేసుకుని, అనేక అపవాదములకు తావిస్తుంది''. అర్థమెరిగిన రాజాస్థానమే కాదు మనది. దైవం మలచిన అపూర్వ సృష్టి. దీని నర్థం చేసుకోగలిగే స్థోమత యీ కాయం అనుభవిస్తే చాలు - - - " ఆరాధకుడైన రాజు సమక్షంలో నిరాశలకూ, విధి నిర్వహణలో కన్నీటికీ తావులేదు'' అలాంటి జాడ్యమేదీ మన యదువంశంలో ఉద్భవించగూడదనే

ముందు మీకిది తెలియజేయడానికే తమ్ముడలా "ఐహికబంధం పరిసమాప్తం కాగూడదంటున్నాడు " అంటూ ప్రబోధిస్తున్నట్టుగా అన్నాడు బలదేవుడు.

బలదేవా! మీరు బోధించిన జీవన సూత్రం మేరకు యదుకులం యెంతవరకు బాద్యత కలిగి వుందంటారు? అర్థమైంది యెంత అంటారు ?

అర్థం కావడం మాట నిమిత్తమాత్రుల కనవసరం. అనంతుని దృక్పథం ఆవేశం రానంతవరకే. వచ్చినా దానికుపశమనం చేయడం అంత్య స్థాయిలోనే. అంటే, "ప్రాణి తన భావ ప్రకటన చేసి, ఫలితం అనుభవించి అందరికి తెలియజేయనంత దాకా ఎలాంటి చర్యా ఆనందుడు తీసుకోడు". తపశ్శీలుడు ఓర్పును కుంటువడకుండా చేసినంతనే భగవానుడి దర్శనమవుతుంది, కరువు తీరుతుంద. అది మనోనిగ్రహంపై ఆధారపడివుంటుంది. అది మీలో కలిగిందాకా గాని మీ వయస్సు ఎంతో గణింపలేము.

అందుకే ఆయుఃప్రమాణంతో అదుర్దాపడవలసిన పనిలేదంటారా బలదేవా ?

అదివేరే చెప్పాలా అనిలా ? కృష్ణయ్య అడుగడుగునా మనకు స్వచ్ఛందమానసుడై ప్రబోధిస్తున్నప్పుడు. మన జీవన ప్రమాణం అత్యుత్తమమని అవగతం చేసుకుని ఆయనతో కాలం గడపడమే మనం యీ జన్మకు చేయవలసిన పని.

బలదేవుడు భగవానుడి బాహ్యస్వరూపం. అంతస్సౌందర్యాన్ని అలముకుని అనంతుడినే ఆరడి చేయగలదిట్ట, అందుకే అన్ని జవాబులు నిర్మలంగా యివ్వగలుగుతున్నాడు. ఆ చిత్రం గమనిస్తున్న చిదంబర స్వరూపుడు చిత్రంగా చిన్నగా నవ్వుకున్నాడు కూడా.

ఈ యదార్థాన్ని గమనించడానికే యింత కాలం పడితే, అభ్యసనకీ అమరికకీ

వూపిరి విడనాడే అనామకుల సంఖ్య లెక్కించే పని సానుభూతితో ఎవరు చూస్తారు బలదేవా ?

" ఆ విషయం కృష్ణయ్యకే వదిలివేస్తే సరిపోతుంది. అది తన ధర్మం కాదంటే మనం చేసే ఆరాధనకూ. తను పొందే తృప్తికీ, యీ యుగజననానికీ అర్థమేముంటుంది"? అంటూ పేలవంగా చూస్తూ కర్తవ్యాన్ని ఉసి గొల్పినట్లుగా చూశాడు బలరాముడు.

"మానసిక రుగ్మతలనంటి వున్నా అభ్యసనపేరుతో ఆధిక్యాన్ని కూడ పుంజుకుంటున్నారు". మొత్తానికి ఘటికులు యాదవులు."అంటూ చిరునవ్వు నవ్వాడు నల్లనయ్య.

అర్థం కానట్లు అందరూ ఆయన వైపు అదోలా చూశారు. బలరాముని కళ్ళ వెలుగులు కృష్ణుడి పైబడి మెరిసిపోతున్నాయి. అనిర్వచనీయమైన కాంతియేదో వారిద్దరినీ తన్మయుల్ని చేసింది. ఆ తన్మయత్వంలోనే వారు కర్తవ్యాన్ని కొంత నిర్వహించినట్లు ఆనందించారు.

"మిత్రులారా! మీ కున్న అయోమయావస్థ నాకర్థమయ్యే నేనీ యదుకులంలో ఉద్భవించానని వూహిస్తున్నారా ? అది నిజం కాకపోతేమటుకు మీ పుట్టుక క్రమం సంగతి ఎలా పరిపూర్ణమయ్యేదోనని ఆలోచిస్తున్నారా ?" కృష్ణయ్య సాధారణ మానవుడిలా అడిగిన ఈ ప్రశ్నకు

కృష్ణా! " మాజన్మ కారణం కొండంత లాభం కోసం కాకున్నా, రవంత తృప్తినిచ్చి నీ నామ సంస్మరణం వల్ల తరించిపోయే జనసందోహంలో వొక భాగంగా మాత్రం ఎందుకు కాగూడదు"? అనిలుడు నెమ్మదిగా అన్నాడు.

యదార్థంవచించావు. యుద్ధానికెళ్ళే రాజు వొక్కడే విజయాన్ని సాధించలేడు. వెంట సైన్యం సంపత్తి కూడ అవసరం గదా! అదీగాక వారితోనే విజయం మూడు

కృష్ణా ! మీ యీ మాటల కర్థం చాలా చిన్నగా వుందయ్యా ! సామాన్యమైన రాజశక్తి చెబుతున్నారు. ఇది - ఏ పట్టానా పోలలేదు.మానవమాత్రుడైన రాజుకు అన్ని విధాలైన బలమూ వుండాలి. కాని మీరు శక్తిధరులు. మీలో విశ్వం సమస్తమూ జీవిస్తోంది. విశ్వతో ముఖుల కిట్టిమాటలు తగునా ? మీ ఆంతర్యం మిమ్మల్ని తెలిసియు ప్రశ్నిస్తుందే కాని "మీకు తోడు " అనే మాటెక్కడిది స్వామీ ?

కృష్ణుడు చిన్నగా నవ్వి

సుచరణా ! నువ్వు చెప్పు. అనిలుని వచనాల్లో ఎంతవరకు సమంజసముందో.

అదేమిటి స్వామీ! మనస్సు శరీరం నిర్ణయించాక మరొక అంగం ఎదిరిస్తే ఆ కాయంలోని సంకల్పానికి సార్థకతయేముంది? మా ముఖంగా మీరు న్యాయమేదో ఆలోచించుకుంటున్నారని భ్రమించడం తప్ప యింకేమనగలము ?

భేష్! బాగా చెప్పావు. సుచరణుడి మాటను సమర్థించాడు శివదేవుడు.

"భ్రమ"- ఎప్పుడూ పరిపూర్ణం కాదు సుచరణా ! అది కేవలం క్షణికమైన జీవన స్పందన. నిర్విరామ ఆర్జనకది అడ్డుతగిలి కొంతసేపు మనోవాక్కాయ కర్మలను నిలువుమంటుంది. పంచేంద్రియ జ్ఞానమున్న ప్రతిప్రాణీ దానికి సులభంగా కట్టువడుతుంది. అందుకని అన్ని ప్రాణులకిలాంటి అవగత జ్ఞానముంటుందనుకోవడం మంచిది కాదేమో !

కృష్ణా! మరి సంస్కరించబడిన జ్ఞానంతో, స్వచ్ఛంద తేటమాటల తో పులుగులు సైతం మీ చరితకు వుపయోగకరంగా వున్న మాటపై మీరేమంటారు?

అదేప్రభూ! పూర్వజన్మమున మాకున్న ఫలిత సంయోగ స్వరూపమే, యీ జన్మకు మేము పొందగలుగుతామను విషయం మీ నుండి విన్ననాడు మాకు నిశ్చలత్వం సంక్రమించగలదు.

అంతే కృష్ణా! మాలో మేము అమరసిద్ధి కోసమని పెంచుకున్నదంతా వొక జాడ్యమనీ, గతం తాలూకు వాసన యేదో మళ్ళించి పుణ్యం కట్టుకుని మీ సాంగత్యంలో తరింపజేస్తోందని మేమూహించడం పొరపాటేమీకాదనుకుంటాను" అన్నాడు సుచరణుడు అర్థ నిమీలితనేత్రుడై.

"నల్లనయ్యకు తెలియని పొరపాట్లు మానవమాత్రుల కంటూ వేరేమున్నాయి సుచరణా! అవసర పూర్తి ఏన సంభాషణ పెంచుకుంటామే గాని వేరేముంది ? అంటూ సవరించాడు శివదేవుడు.

అలా కొంతసేపు ముకుళిత హస్తులై గోపాలురంతా మౌన ముద్ర వహించారు. అంతలో యేదో కబురు మోసుకువచ్చిన వాడిలా భాగవత శిఖామణియైన అక్రూరుడు అటువైపు వచ్చాడు.

అందరూ అక్రూరుని ముఖంలోని విశేషాన్ని గ్రహించ ప్రయత్నించారు. నిర్మల హృదయుడైన ఆ భక్తుని తెలుసుకొన భగవంతుడికే శక్యము గాకుండ నింక నీ యడవి ద్రిమ్మరుల మాటెంత ?

కృష్ణుడెదురేగి ఆదరంతో తీసుకొని వచ్చి సుఖాసీనునిజేశాడు. ఆ మీద తానేమి చెప్పునోయని వేచి వున్న కృష్ణుని జూచి.

కృష్ణా! నీ పంపున వెళ్ళి ఇంద్రప్రస్థపురి క్షేమములు తెలుసుకుంటిని. సకలజన నుతురాలైన కుంతీ దేవి నాతో ప్రియంగా మాట్లాడి పంపించింది. ఆ మహాతల్లిలోని ప్రతి మాటా అనురాగ సుధలనే విరజిమ్మింది. ఎంత ఆనందించానో - - - !

అక్రూరా! ఆత్మీయతగల వారెవ్వరయినా పరుషముగా మాట్లాడలేరు, చూడలేరు, వారిలోవున్న మనస్సు వెన్నలా కరిగి చూచేవారికి విందులు చేస్తుంది. కౌరవులందరిలా కుంతీ దేవిలో ఆప్యాయత మృగ్యమైపోదు, ఆమె మనసు సదా కరుణావాహిని. మానవీయతలోని యదార్థాన్ని గ్రహించి, సకల జనాహ్లాదం చేసి

కరిగించే శుద్ధ వాక్చాతురి ఆమె. లోకమాతలా ఆమె కోరే క్షేమం అందరికీ ఆనందాన్నిస్తుంది.

ఔను కృష్ణా! భర్తృహీనయయ్యీను, అ మహనీయురాలు చూపిన గుండె నిబ్బరమూ, ఔదార్యమూ గణనీయమైనది సుమా! ప్రస్తుత దుఃఖాన్ని మరిచి, కుమారుల క్షేమం కోరుతూ చక్కగా లోక సమ్మతంగా ఆమె మాట్లాడిన తీరుకు నేనే చకితుడినయ్యాను. ఆమెలో రవంత ఆవేదన కూడ నేను గ్రహించలేకపోయాను. ఆమెలోని గాంభీర్యం, వేదాంత తత్వం అర్థాంతరంగా సంభవించేదనే కన్నా, ఆయువు పోసుకుని జీవిస్తుందనడం సమంజసమనుకుంటాను. కాకపోతే, స్వతహాగా కష్టాలపై విముఖత లేక సహృదయంతోనే గాక, సామాన్యంగానైనా విచక్షణ చూపక, అతిథి అభ్యాగతుల నాహ్వానించి యుక్తమైన రీతులు ప్రబోధిస్తోందంటే ఆశ్చర్యం కాదా

అవును మరి. ఈ నా పరివారమంతా మరో కొన్నేళ్ళకు పొందవలసిన జ్ఞానం, ఆమె కొన్నేళ్ళ క్రితమే పొంది నన్ను కదిలించివేసింది. అప్పుడే నేను అత్తా ! అని పిలిచి ఆమె ఆప్యాయతకు సన్నిహితుడినయ్యాను. ఈ సత్యమే నేను నా తల్లి దండ్రుల కన్నా ముందుగానే గ్రహించినప్పటికీ, లోకం దృష్టిలో నేను గుప్తంగా నివాసం కల్పించుకున్నాను. అందుకే ఆమె అన్ని కర్మలందూ అతీతురాలేనని చెప్పగలను''. అంటూ ముగించాడు. తల్లిని గురించి చెప్పే తనయుడిలా ఆనందించాడు కృష్ణుడు.

మేము యింత నిజం అర్థం చేసుకుని వుంటే యింక మాకు గతానుగత సంస్మరణం స్ఫురించి, ఆదిదేవుని అవసరం లేకుండా, ఆయుః ప్రమాణ ప్రమేయం లేకుండా - - - ఆశించిన మేరకు అతీతులమయ్యే వారమే కృష్ణా! కాని అది సాధ్యమెలా ? ఒక వేళ మేము అందుకే నియోగించబడివుంటే మాకీ అవగాహన జ్ఞానం మాత్రం యెందుకు ప్రభూ! ఇంకా ఏదో చెబుతూనే తనను తాను మరిచిపోతున్నాడు అక్రూరుడు.

పదిలంగా అక్రూరుడనే ప్రతి మాటా మాధవునిలో పేరుకు పోతోంది. ఒక్కసారి ఆ భగవానుడి హృదయం రెపరెపలాడింది. ఆనందంతో - - - సమాధానం చెప్పేందుకు నోరురాక తృప్తిగా నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పులోనే ఎన్నో 'అర్థాలు' యాదవులందరిలోనూ మరో లోకం సందర్శించినంత దృశ్యం కనబరిచేలా చేశాయి. అమేయమగు భక్తి పారవశ్యంతో కొంతసేపు మౌనంగా వుండిపోయారు.

అక్రూరా! ప్రవిమలాత్మజయైన కుంతీ దేవిలోనే కోరికల సుస్థిర స్వరూపం జన్మించినదని, చెప్పడంతోనే మీరింత దూరం వూహించారు. " ఆ ఆత్మ బ్రహ్మాండంలో ఒక అంశమే అంటే నమ్ముతారా" ? బ్రహ్మాండం అనడం కన్నా అందని స్థాయి అనడం బావుంటుందేమో! అంటూ కృష్ణుడు చిరునవ్వు నవ్వాడు తరువాత తనేదో ప్రదర్శించనున్నట్లుగా.

"అంతదూరం యోచించదగి వుంటే మేము ధన్యులమే ప్రభూ! కాని, అందరాని గగన కుసుమానికి అంగలార్చడం కన్నా, అర్థవంతములో ఆవిరిలా సోకి, కొంత చేవగలిగి వున్నామని మీ ముందు నిలువ గలిగితే మాకు తృప్తి కదా"! అంటూ శివదేవుడు అర్థనిమీలిత నేత్రుడై నమస్కరించాడు. అక్కడ అందరూ భక్తులే. అందరూ ఆ స్వామిలోని అనంత శక్తిని చూడాలని వేచి వున్నట్లున్నారు. బలదేవుడిలో ద్వైత భ్రాంతి కలిగింది.

క్షణంలో - - - ఏదో- - - మార్పు-- -ఏదో మెరుపు.

భగవానుని స్వరూపం దివ్య తేజస్సుని పరుస్తోంది.

విశ్వమంతా స్వామి యెదుట ప్రత్యక్షమైనట్లుంది.

జగన్నుతుని వెదకడానికి అందరికళ్ళూ ప్రయత్నిస్తున్నట్లుంది.

జోడించిన చేతులు శివదేవుడు విదిలించలేదు.

ఏదో అడగబోయిన అనిలుడు నోరు మూయలేదు.

సుచరణుడు ఎత్తిన తల దించనే లేదు.

చూస్తుండగానే అక్కడి జనమంతా మ్రాన్పడిపోయారు.

భూదేవి మొదలు ఆకాశం చివరంటా ప్రశాంతం అలముకుని వుందానిపిస్తోంది.

ప్రాణికోటి సంచరించినట్లు కూడ లేదు.

దిక్పాలకులు స్థావరములు మరచి మూగపోయారు.

పంచభూతాల సవ్వడి ఎంతమాత్రమూ లేదు.

అక్రూరుడు సాష్టాంగ పడి అరవలేకుండా వున్నాడు.

రోదించడానికి నోరురాని భక్తులంతా స్తుతించడానికి.

సిద్ధంగా వున్నట్లున్నారు. గోపికల భావాలు కళ్ళల్లోనే కనిపిస్తున్నాయి.

"అణువాదిగాగ బ్రహ్మాండంబులన్నీ నిండి వెలుగుతున్న శక్తి" ఎన్ని ఘడియలు అలా స్తంభింపజేసిందో వూహకందని విషయం.

ఆ శక్తిలో-- అమృతమయ అనుభూతి తాలూకు స్ఫురణలెన్నో వున్నాయి. ఆ శక్తి జగన్నాటకంలో వంచిత కానిది. యుగారంభ హేతువులై జనావళి హృదయోన్మాదాన్ని సడలించి, వినూత్న "అనుభవ జీవం" నింపివేయగలది కూడ. అందుకే చరాచర జగత్తు జడత్వాన్ని ప్రేమించిందావేళ. అనంతుని సర్వతోముఖ బాంధవ్యం క్షణమాత్రం మరోపనిలేక, యాదవాభ్యుదయకర్తలపై నియమరహిత అచేతనత్వాన్ని చుట్టుముట్టింది. అలా ఎంతసేపు ఆ అనిర్ధారిత కాలం వారిని వూపిరి సలుపనీయక తీయని ఆనందానుభూతిలో వుంచిందో! కాలం తెలియడంలేదు, కర్తవ్యం బోధపడడం లేదు.

మరో క్షణం అలా... అలా మలయానిలుని కదలిక

పొగడపూల వాసన......మందాకిని యమునానది తరంగ ఘోష.

అరుణారుణ సాంధ్యరేఖ స్పర్శ. నీలి మేఘపు నీడలు .........ఒక్కొక్కటీ యీ సృష్టిని మేల్కొలుపుతున్నట్లుంది.

శ్వాసావయవాలు జాలిగా కదలుతున్నాయి.

మందస్మిత వదనంతో మదనగోపాలుడు, గోపాలకులారా !హితులారా అంటూ సంబోధించాడు.

ఆడమగ తేడా లేకుండా నిశ్చేష్టులై యాదవలోకమంతా మూలిగింది "స్వామీ' ' అని. సుమారుగా అందరి కళ్ళల్లోనూ ఆనందాశ్రువులున్నాయి. అక్రూరుడు లేచి నిండుగా స్వామి కళ్ళల్లోకి చూసి మళ్ళీ మూసుకున్నాడు. ఆ తరువాత కృష్ణుడు

మిత్రులారా ! "అనల్పమైన సందేహమేదో జన్మతః మిమ్మల్ని పీడిస్తున్నదని భ్రమపడ్డారు. అదే యిప్పుడు మీకు బలంగా నమ్మకమైనదనుకుంటాను. "ఆశ మానవులకు ఒక ఆశ్చర్యబంధనం". అది లేని వారు మానవాతీతులు. వారు నిర్వాణమును బొంది, సకలశంకా నివృత్తి చేసుకుని ఏకాభిప్రాయాన్ని సాధించగలరు. మరోవిధంగా వీరిని ఉపాసకులనీ, ఫలిత సాధక సుముఖులనీ మరీ దూరంగా ...మునులనీ వ్యవహరించదగును. శ్రేష్టమైన జ్ఞానమును బొందుట అంటే.... సాధనలో యేమరక వుండు[illegible]. అలా వుండదగిన వారికి పూర్వజన్మ వాసన అంటూ వుంటుందనడం యదార్థం. " అలాంటిదేమైనా మా కుందో వుంటే ఎంత మాత్రమో' '! అని మీ అంతర్యాలు గొణగడం నాకు తెలుసు. జన్మ పొందేముందు కొందరికి అపూర్వమనీ, మరికొందరికీ మృగ్యమనీ, తెలిసీ తెలియని జ్ఞానం ప్రసాదించబడివుంది. ఇది మీ హృదయాల్లోతెలియని "రుగ్మత"యై కూర్చుంది దాని మూలంగానే తృప్తీ - అసంతృప్తీ అనే రెండు విభాగాల్లోనూ గోకులం అవతరించింది. కాని యిరువురూ ఏకకాలమందే ఉద్భవించారనే విషయం మీరు మరువరాదు. ఇకపైన సాధించుకునే

పుణ్యం మీ ప్రస్తుత కార్యాల్ని అనుసరించే వుంటుంది, "గతం వాసన యీ జన్మ వుద్భవం నాటికే పరిమితం". నిరాశజెందని "మనం" మనంలా యుగధర్మాన్ని సంరక్షించుకుని బయట పడదాం. భావితరాలకు చక్కని సందేశాన్నిద్దాం. శంఖారావంవలె.......ధ్వని...... వినిపిస్తుంది ) అదిగో సైన్యాధిపతి శంఖారావం పదండి కర్తవ్యపాలనకై వుద్యుక్తులు కండి! గతాన్నొకమారు చెరపి, యదార్థాన్ని పరిశీలించండి' '. అంటూ ముగించాడు కృష్ణుడు.

ఆ సందేశం, రాజు తన ప్రజలకిచ్చిన కర్తవ్య సందేశంలా వుంది. మామూలు మనిషిలా కృష్ణుడు వచ్చి బలదేవాదులను స్పృశించేదాకా "కృష్ణయ్యా" అని ఎవ్వరూ పిలువలేకపోయారు....!

ఆ దినం "ఇహం" - "పరమును" చేయెత్తి జోకొట్టింది.

×××××××

# 4

త్రేతాయుగంలోవలె ద్వాపర యుగంలో అమేయమగు శక్తి ప్రదర్శన జరుగకున్నా, తేజోవంతమైన స్వరూప సాక్షాత్కారం అడుగడుగునా ఆవిర్భూతమై. అవిగీతమై (శ్రేష్టమై) విలసిల్లినదనుట యదార్థము. సకల జీవ, లయ, కారణ జననం యీ యుగమందే అతి సామాన్యులకు అధికంగా లభ్యమైంది. అందుకే "అపురూపమైన సృష్టి యీ యుగమే" అంటే అతిశయోక్తి కాదేమో"! అన్న నారదుని మాటలకు నవ్వి వూరుకున్న కృష్ణునిలో నిర్లిప్త రేఖలున్నాయి. దేవర్షికి తప్ప మరెవ్వరికీ కనిపించని, ఆ రేఖల తాలూకు జీర్ణాయం; పొదివి పట్టిన స్వేచ్ఛతో మునిపుంగవునిలో పొరలింది. జోడించిన చేతులతో తదేకంగా చూస్తున్న నారదునికి, తదనంతర కర్తవ్యమేదో బోధపడలేదు.

అవలీలగా కదిలించగల ఆ మేను వేయి పర్వతాలతో సరితూగ గల బరువయింది. ఆ మేధస్సు ఎన్ని క్షణాలో పని చేయడం మానుకుంది. దివ్యలోకాలు క్షణంలో సందర్శించు వనజభవాత్మజునికి కాళ్ళు భూమిలోకి కూరుకు పోయినట్లుంది.

మరేమిటా నిర్లిప్తరేఖ ?

ఏమిటా నిర్లిప్త జగన్మోహన హసనము ?

"అవును కదూ! తనకు మాత్రమట్టి యోగము సంభవించగూడదనేముంది? నాడు....శ్రీహరి సాయుజ్యమనవరతము నా వెంటనుంచు కొనదలచితినన "వాణీ రమణ సుతుడవై నాపంపున లోకములందర్శింతువను" పలుకెంత దూరము కాలేదు కదా! ఆహా! ఏమి నా భాగ్యము! స్ఫురణకు వస్తున్నంత పేర స్వామి చరణాలు శ్రీ చరణాలై యెదలో నిండి, నన్ను మరింత ఉన్మత్తుని చేయుచున్నవి" అంటూ

ఏమిటి నారదా! నీకు మా వద్ద మృష్టాన్నము లభించుట లేదా ? అతి నిశ్చలత కూర్చి నిన్ను కదలనీయని సమస్యయేదో పట్టినట్లుంది సుమా''!

కృష్ణుడు కొంటెగా నవ్విన నవ్వులో నారదుడికి తగినంత కర్తవ్యబోధ కనిపించలేదు. కారణం! మోహన ఆవహమైన మైకం తననింకా వదలలేదేమో! అయినా స్వరం తగ్గించి కొంత జార్చిన లౌకికానుభూతితో....

కృష్ణా! " నా కర్తవ్యమును మరచి ఎన్ని సార్లో అన్యచింతన చేయుదునన్న యీ హృదయాన్ని అదుపులో పెట్టుకోలేని పరిస్థితి ఏర్పడుతోందంటే, నేను వరమంటే యేమిటో ! దాని అర్థం కూడ మరచిపోతున్నాననుకుంటున్నాను. మీ ముందు ఏమి చెప్పలేకనో తడబడిన అంశమును, మీరు మనస్ఫూర్తిగా త్రోసివేసి, ఇహంలో "ఇతి కర్తవ్యం'' అని వ్రేలు చూపి బెదరిస్తున్నారు ప్రభూ! ఇంక నేను భోజన ప్రసక్తి ఎలా యెత్తను''.

"దేవర్షివై యుండి సఫలతల్లో సైతం అభీష్టసిద్ధి కొరవడిందని నిరాశపడుతున్నావు. నీ బోంట్లకు యీ తరుణం నిరాశాజనకమైతే నేను అదృశ్య సాధన చేయవలసి వస్తుంది''. అంటూ సన్నగా నవ్వాడు కృష్ణుడు.

వద్దు ప్రభూ! వద్దు. ఆ పని మాత్రం చేయకు. సార్థకత కోసం నియోగించిన పని విస్మరించి, ఆంతర్యాన్ని అదుపు తప్పిస్తే నేను భ్రష్టుడినై పోతాను. నిదాన పరిష్కారంలో నీలిమకు స్థానం రాకూడదు కృష్ణా! రాకూడదు. విధిబలీయమైతే నావంటి తేలిక వర్తనులకు చంచలత్వం అవశ్యం. కాని జగన్నాటక సూత్రధారులకు జగమే జీవనకర్తవ్యమనే నిజాన్ని యింకా లోకం తెలుసుకోవాలి. ఒక నిముషం నీరసపడి నన్నుచూసి, మీరింత నిర్లిప్త వైఖరి ననుసరిస్తే భవితవ్యం మాటేమిటి ? నేను.......మీకు చెప్పగలనా ప్రభూ !

భవితవ్యం సంగతికి నాంది, నీ వల్లనే కదా జరిగేది ?

అనడం ఎంత తేలిక? అహో! మురహరుడు మూలపురుషుడు కాడేమో! దుర్భేద్య సమస్యను పరిష్కరించడానికి యజమానునితోనా సాధింపులు ? ఎక్కడి అధికారం ప్రభూ! నాకింత చనువు తగునని లోకులన్నట్లే ప్రవచించితిరి !

అదేమి నారదా! ఈ రోజు వింతగా మాట్లాడుతున్నావు ?

ఆవింత మీకు క్రొత్త కాదు గదా ! స్వామి యెదుట సలక్షణ సంభాషణ తగునని యెంచకయే వక్రించిన దారిననుగమిస్తున్నానేమొ! అనే శంకదప్ప వేరొకటి గ్రహించుట తగునా కృష్ణా! శ్రీకాంతునికి శివమెత్తించే చర్య జేయమందువా ?

"అవసరమైతే లోక కళ్యాణార్థం తప్పుకాదుగదా! యదార్థమునకు యెంగిలి యనే సంశయం కలిగించినంత మాత్రమున, దానికున్న నైజం భరించరానిదని ఋజువు చేయడం కష్టసాధ్యమని యెరుగకనే వున్నాననుకోకు" జగద్విదితమైన కార్యం నేను - నువ్వు మార్చినంతనే మారడం అబద్ధం. అంతుబట్టని ఆవేశం కల్పించుకుని యుగసంధిలోకి వూపిరి లాగడం నా అభిమతం కాదు నారదా !

అయితే, యీ నిర్విణ్ణతకొక మారు పరాజయం కలిగిందని సమర్థించుకుంటే సరిపోదా! ఇంతగా యీడ్వడం దేనికి స్వామీ !

"కల్పించుకుంటేనే అపోహలు. నీయోగ సమాధికి సువ్యవస్థిత రూపకల్పన యీ క్షణమే కావాలనుకోవడం నీ దురదృష్టం. జరుగవలసినదేదో జరగకమానదు. నిమ్మళించిన మీదట అదే సరిగా కుదురుకుంటుంది. ఈ మాత్రం నమ్మకముంటేనే .....ఆ పైన సవ్య ఆరోహణకు అడ్డు వుండదు. నీ ...ఆశయం...తప్పక ....ఫలిస్తుంది. నీవు మాటలలో తెలుపనంత మాత్రాన నీ అంతరార్థం గ్రహించియే నేనీరీతి ప్రశ్నించి కర్తవ్య రూపం కల్పించాను. అయినా.......పరిపూర్ణావగతి కోసం నీవు ప్రాకులాడే తీరు చూస్తే వింతగా వుంది. అందుకే నిన్నలా అడిగాను".

నిజమే కృష్ణా! నా ఆతురతలో అణిగి వున్నది ఆవేదనే కాక, అపురూప సంకల్పం కూడ వుండేది. దానినిప్పుడు నివృత్తి చేసుకో గలిగాను. అన్నిటికీ నీవే

వున్నావను ధ్యాస నాలోమృగ్యమైంది. అందుకే నేను క్షణం స్తబ్దుడినై కర్తవ్యం విస్మరించాను. ఆశించిన ఫలం చేరువలోనుంచి జారితే, మళ్ళీ అవగతం చేసుకోవడం శూన్యమనే మానవేతర సంక్షోభం కలిగి మాత్రమే నేనన్నాను. అన్యథా భావించినచో భరించని వాడినవుతాను. సరే! అదలా వదిలేయి.

మీ మేనత్త సాత్వతి వొక విచిత్రమైన కుమారునిగన్నది. నాలుగు భుజములవాడై, ముక్కంటికి ప్రతిబింబమై ఉద్భవించాడు. యోచించిన కొలది వినూత్నతను ఉత్పత్తి చేస్తుందా వార్త. మిగులు అవయవాలు, వానిని ఎవరెత్తుకుంటే పోవునో వారేయతని మృత్యువు కారకులట. చిత్రమే కదూ !

చిత్రమేముంది ! అతనియదృష్టరేఖ......!

పోనీ! మీరొకసారి యెత్తుకుంటే........!

ఊఁ! నారదా! నీ నేర్పు కూడ పెరిగినట్టే వుంది !

అపచారం ! అపచారం. నా నేర్పు మీ చేష్టలకు తగునా !

తగునా!......అయినా!......అయినా!...........!

అయినా.........!

“ఆఁ! ఏమిలేదు. ఎక్కుడుండుకరాదులు తీసే దారి అభినందనీయం అగునా ప్రభూ''. ''కన్నుకరములెక్కువైన చూపు చెయిదములెక్కువవునేమో''! “అభినందించవలసిన అవసరం మేనబావ కలిగించుకోడనే తలుస్తాను''.

మీ అభినందన కో విశిష్ట మార్గం వుండాలనడం తప్పు కాదు. కాని మేన బావ మేను దాల్చిన తీరు. మెరుపు తీవలో రాతిపూల చందమయ్యేనని నా వూహ!

"వేసినరంగు వెలిసి పోకముందే ఆ నమ్మకం. ఆ మీద గుట్టురట్టవుతుందిగా! ఘటనా ఘటన సమర్థులు. మీ చర్యలలో లీలలు అవగతం చేసుకోలేని ప్రజాకోటి బసవన్నల్లా తలలూపుకుంటారని మాత్రం నేనెరుగుదును స్వామీ"!

తెలిసి తేట పరచని తత్వం నీకొక్కడికే దక్కింది నారదా ! అంతిమయాత్ర పూనికకు ఆరంభకుడవు - నిన్ను మించిన సాధనయేమున్నది" ?

నారాయణ ! మరోక్షణముంటే మాంత్రికుడిలా మాయజేసే లాగున్నావు 'నా' అనునది సమస్తము మీ లోనే వున్నదని కూడా మరుతునేమో! పోయివచ్చెదను - సెలవామరి !

శుభమగుగాక !

నారదుడు వెళ్లిన వైపే చూస్తున్న కృష్ణుడిలో ఏలాంటి అనుభూతీ కలుగలేదు. అన్ని పవిత్ర నదులను తనలో లయం చేసుకున్న రత్నాకరుడిలా వున్నాడు. జగదాధారుడుగా జనించిన దేవలీలామయుని దివ్యదృష్టి నెవరు చూడగలరు ? ఎందరు ప్రయత్నించగలరు ? త్రిలోక సంచారియైననూ తిన్నగావంట యింటికేగి అమ్మ ఆజ్ఞమేరకు నిరీక్షించుటయేగదా ! సామాన్య విశేషములనెరుగక, అలా జగన్నాధుని నెలవుకోసం తిరిగి కార్యమునెరపి జగత్కల్యాణానికి మూల స్థానమైన ప్రభు ధర్మంలో పరవశించిపోయే నారదుడికి, అవని యెంతని ? పరుగు తీసే కోడె పసుగులా ఆలమందనుదాటి, వెరచుట - మిగిడివచ్చుట అన్నట్లుంటుంది. నారదాది కార్యశీలురను గమనించలేని దైవమున్నదా ? హృదయ సౌందర్యంలో పండిపోయిన మునిగణమ్ముల రక్షించే భగవానుడిలో నిర్లిప్త భావముండునా ? వారిని కాపాడుటకు అవతరించిన స్వామి చరణ పల్లవములలోనే నిర్లిప్తత గమనించినట్లైతే, నిరాశాజనకమై జగమంతా నిలిచిపోవునుగదా !...ప్చ్ !

ఆశ్రిత జన హృదయచోరుడైన కృష్ణుని ఆరాధించి తరించిన వనితలలో విరజ యొకతె. గోలోకమున ఆమెకున్న విశిష్ట స్థానం అద్వితీయమైనది. మధుర తలపులలో మరిగి, విరిగి చెలగిన రాధాదేవిని బోలిన యీమె ప్రసన్నత అనుపమానమైనది, నింగి నీలిమను జూచి నీరజనేత్రుడేయని తలపోయుచున్న ఏకాంత కాంతను సమీపించే ఆనందుడు పరవశాత్ముడు. పరస్పరావగాహనంలో మణిదర్పణంలా వెలిగిన యీమె కీర్తి భాగవత పార్శ్వము. అతిచిన్న అంశమైననూ - లేశమాత్రమైనా..........

కళంకమాపాదించని యీగాథ రసభరితమూ, రమ్య కథనమూనూ.

వీరిది విచిత్ర సమాగమం.

"విలయం అనిపించే ధ్వని జనిత ప్రేమా, ప్రణయమూ". విలయమంటే తత్తరపడిన విలయం

"వేషము మార్చినా వెలకట్టగలిగిన వేదాంతం."

"కాలం ఆగినా కర్మను నడపగలిగిన శక్తి".

ఆరిన ఆశలో సైతం నిండుదనం నిలుపగలిగిన మనోస్థైర్యం.

"అందుకే ఆ ప్రేమ వాహిని నిశ్చల సంగమం."

"అందుకే అది అనుపమాన సమాగమం"

విరజావికుంఠుల ప్రేమ...అంకురిత విలాసమయం......!

ఒక రోజు తన కుటీరంలో విరజ విరహాజయ్యెయున్న సమయంలో వెన్నుచాటుగా వెన్నుడు ప్రవేశించాడు. అంధకారాన్నలముకున్న తన హృదయ కుహరము వేల కాంతులతో వెలిగినంత అనుభూతిని పొందింది. ఎదురుగా తిరిగి నిలిచిన ఆ స్వామిని అశ్రుపూరిత నేత్రియై చూసి, "కమలాకాంతుని కాంతి కారణ జన్మలకే వశమని" నిరూపించితిరి ప్రభూ! అంది ఎద్దేవనగా.

ధవళ కాంతులీను ఆమె మేను పుట్టములకు, ఆ కళ్ళలోని నిశ్చలతకు ఆయన చూపులు ద్విగుణీకృతములయ్యాయి. క్షణం నిశ్చేష్టుడయ్యాడు కృష్ణుడు. ఆమె పట్ల అతని కుతూహలం పెరిగింది.

విరజా! " స్వార్థ చింతన వీడకపోతే, మరో జన్మతథ్యమై విమలత్వమును కోల్పోదువు. " ఇప్పటికిది చాలు" అంటే శుచి మనస్సుతో నేను నిన్ను విడిచి వెళ్ళేందుకు ప్రయత్నిస్తాను.

"ప్రయత్నించడమేమిటి ప్రభూ! ఎందుకైనా సమర్థులు. త్రిప్పి మాట్లాడుట మీకు చేతగాదనుకున్నాను". అమె కన్నులు చెమర్చాయి.

మరి నా కాపాదించిన నేరం నేనెలా విడిపించుకోగలను ? నీ కోసం నేను మరో రూపం ఎలా దిద్దుకోగలను ?

అదేమిటి వంశీ! నా కోసం మరో రూపం దిద్దుకోవడమా ? వున్నంతలోనే నేను సతమతమైపోతున్నాను. బ్రహ్మాండము భరించగల స్థాయి ఈ పాటి ఆవేదనతోనే కుంటువడడం సాధ్యమా ! నా బోంట్ల కిట్టి బాధ కలిగించడం న్యాయమా ?

"న్యాయాన్యాయ విచక్షణ సాధకుల సౌశీల్యతలో నిక్షిప్తమై వుంటుంది. అది విడంబన హేతువాదనపై ఎట్టి చర్యకూ తలవొగ్గదు. బాహిరమైన వాంఛల పై దాని ప్రాతికూల్యమే వొక అందం. తుహిన బిందువులా అంటి ఆవిరై పోవుట వలన కలిగే మార్పును సంధాన క్రియకు జోడించడం వుచితం కాదు". అంటూనే " ఏమో! అంతా నీలి వాదన అనిపిస్తోంది". కృష్ణుడు శూన్యంలోకి చూశాడు.

'తీరుతెన్నులు తిరోగమిస్తే తీర్థమాడిన కాయం కూడ తీరని కోర్కెలకు బలియవుతుందనేలా వుంది మీ ఆలోచన". అపభ్రంశమెరుగని ఆత్మకు కూడ యింతటి బలీయమైన "ఆశ" తగులు కోవడం చిత్రంగానే వుంది. అయినా ........... నాలో ఆత్మవిశుద్ధత గమనించారా ప్రభూ! నా పాపం కాకపోతే మీకీ ఆలోచనయెలా

కలుగుతుంది? పూతత్వం కలిగించే యోచన నాకు కలిగించడంలో మీరే.....తప్పు చేశారంటే.....హుం ! ఉద్విగ్న అయింది విరజ.

అది నీ కర్మ ఫలం. నేను పొరపడే మాట కూడ గుర్తించగలిగిన నీవు పూర్వమే పూతాత్మవై వుందువని నమ్మతాను.

నాకు మరో కళంకమాపాదించకు వంశీ! నిన్ను మించిన వేదాంతినే అయితే అతిదైన్యంగా యింతకాలం నిశ్చలతనే పెంచుకోకపోదును. నీవు నా పట్ల చూపిస్తున్న నిర్లిప్తతకి కారణం తెలియకనే క్రుగ్గిపోతున్నాను.

"నాప్రేమకి దర్పణం పట్టిన దానివి. అతి దైన్యం నీ జీవితంలో కాపురం చేస్తే కళంకాలు, కామితాలు సంతానాలై పసిపిల్లల్లా ఏడ్చి నా చుట్టుముట్టుతున్నాయన్న సంగతి తెలిసే నీవు మాటాడుతున్నావు విరూ."

లేదు ప్రభూ!... లేదు... దుఃఖం పెల్లుబికింది ఆమెలో. కృష్ణుడిలో ప్రణయం పురివిప్పింది. విరజముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని "అంతగా దుఃఖించడం తగదు విరూ! ఈ సమయంలో బలిచేయవలసిన వేదన, బరువై భగ్నతను నీకు సూచిస్తోంది. నాకు మాత్రం యథాలాప సరసంలా వుంది సుమా"! చిరునవ్వు కోసం ప్రయత్నిస్తున్నట్లు కనిపించాడు కృష్ణుడు.

ప్రభూ! మీకేమి సూచించడం లేదా ! మీరేమీ భావించడం లేదా ! అయితే .....అయితే నేను ధన్యను. నేను ధన్యను ప్రభూ! ఇన్నేళ్ళుగా మీ సాంగత్యమునకు తపించి, కనిపించిన తరువాత కూడ దుడుకునయ్యాను. విశ్వంలో యేభక్తుడూ యీ దశలో యింత కఠినంగా ప్రవర్తించడు. కాని నేను ప్రవర్తించాను.అందుకు ప్రాయశ్చిత్తం ! మీ మహోత్కృష్టమైన లాలన ? ఆహా ! ఏమి యీ దివ్య లీలా విలాసం ! ఏమి యీ భాగవత తత్వంలోని మాధుర్యం. కృష్ణా ! నమ్ముతున్నాను. అందుకే రాధ జగన్నుత. ఇంత నిబ్బరం ఆమె ఒంటరితనంలోనే సాధించిందంటే

శిలావశిష్టంలా పడి యుండడమే భావ్యమేమో! అవును .....నేను.......లోకానికి .....ప్చ్!

కృష్ణుని పాదధూళి స్వీకరించి కొంతసేపు తన్మయురాలైంది. తేరుకుని అయితే ! ప్రభూ ! నా దొక చిన్న సందేహం వెట్టిగా అతని కళ్ళల్లోకి చూసింది.

కృష్ణుడామె ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

స్వామీ ! "నీపై యీసు జనించిన ప్రతి వాడికి నీవు చెప్పే గుణపాఠం యిదేనా ? అచంచల భక్తి దీక్షాపరతంత్రుల కిచ్చే ప్రసాదం కూడ వీరికి చెల్లుతుందా?

అంతకు ముందు నువ్వొక విషయం గమనించాలి. "విరక్తి జెందిన ప్రతివాడు ముందుగా నా ఆరాధనలో తలపండి వుంటాడు. ఆ మీద నన్ను పరీక్షింపగోరి అనేకంగా ప్రతి కూలతలు సృష్టించుకుంటాడు. చికాకు పడతాడు-బాధపడతాడు. ఏడుస్తాడు. చివరికి నిర్మలమైన మనస్సుతో నిమ్మళిస్తాడు. ఎందుకంటే .......... ఇంటి చుట్టూ విజృంభించిన గాలి యింటిలో చొరబడనప్పుడు గృహాంతర్భాగమందు వెలుగుతున్న జ్యోతికెలాంటి రెపరెపలూరావు. అలాగే హృదయాంతరంలో జ్వలించే భక్తితత్వం పైపైని అదలింపులకు చలించదు. చివరికది హృదయాన్నే కాదు విశ్వాన్నే కాంతి వంతం చేస్తుంది".

మరి అంత ఆగడమయ్యేంతవరకు నిర్లిప్త వైఖరిలో నుండడమే భగవంతుడి తత్వమా ? అంతటి నిర్వాహకత్వం మాత్రం ఆయనకు ఎక్కడుందో ! అదోలా అడిగింది.

ఈ అడగడంలోనే లోక కళ్యాణమనే బృహత్తర బాధ్యత వుంది విరజా ! ఈ మధ్య విభిన్న దుష్టశక్తులు నిర్మూలించబడుతాయి. "దుష్టశిక్షణ శిష్ట రక్షణ" అనే వుందిగాని పదములు మార్పుజేసి, ఎక్కడా వ్యవహరించడం లేదు గదా ! అదీ గాక నిష్కల్మష భక్తి ప్రపత్తులలో యేదోవొకమూల యించుక "కుసంస్కారపునలత" వుండి తీరుతుంది. దానినాజ్వాలకే ఎరగావించి శుద్ధత్వాన్ని వెలికి తీయడమే ధర్మం. ఇట్టి దానితో కొంత సంఘర్షణ అవసరం. దానిని సంఘర్షణ రూపంలోకి తేవాలంటే

కొంతకాలం పడుతుంది. ఈ కాలానికే "నిర్లిప్తత" అని భక్త, బంధు జన వాడుక, ప్రహ్లాదుని పట్లనేను చూపిన వైఖరి, సంస్కరించిన తీరు ఒక్కసారి ఆలోచించు. ఇన్ని సంస్కరించుకొంటేనే బహుకార్య నిర్వాహకత్వమని అనలేనివారిముందు భగవంతుడు మాత్రం యేంచేయగలడు ?

అదిగో ! నన్ను మళ్ళీ ఆటలోనికి దింపుతున్నారు ప్రభూ ! నా మూర్ఖత తెలుసుకున్నాను. నేను చెప్పుకున్న బుద్ధి సమంజసమని సమర్థించుకోవడం లేదు. అయినా ! నిన్ను "సమర్ధించకేం చేస్తాను విరజా ! నీకున్న అన్ని బాధలూ హరించుకుపోవడమే నాకు కావలసింది'' అంటూ కౌగిలిలోకి తీసుకున్నాడు.

ఆ ఆలింగనంలో కరిగిపోయింది విరజ. స్వప్నసీమలో యిన్నాళ్ళు విహరించిన విరజ యదార్థ స్థితిని నమ్మలేకపోయింది. ఇంకా యేదో వొకమూల ఆమెని క్షోభపెడుతూనే వుంది. సరదా తనని ఆరాధించుకుని జీవితం గడుపుకునే వరం, వంశీ ప్రసాదిస్తాడో లేదో ననే అనుమానం కాబోలు కరిగి కన్నీరై గంగా ప్రవాహంలా ప్రవహించినప్పటికీ తన పవిత్రత చెడకూడదనీ, వంశీమోహనుడి కరుణ జల్లుగా వర్షించి, ఆ జీవన వాహినికి మహోత్కృష్టత కల్పించాలనీ తనలో ప్రార్థిస్తోంది. కాని........ఆ ప్రార్థన ఒక్కొక్కటి వొక్కొక్క ఆశీస్సు అయి కృష్ణుడిలో లీనమైపోతున్న సంగతి, అవిరళ విచార వదన, భావహేతుక నిదానయైన విరజ గుర్తించినట్లులేదు.

అవును ! బలీయమైన భక్తుని భావనలోకి సులువుగా ప్రవేశించడానికి భగవంతుడికి కూడ ధైర్యం లేదు, శక్తి చాలడం లేదు. అదీ ఒక మహత్తు గానే భావిస్తాడు.........ఆహా ! భక్త జనలోలుడు గదా భగవానుడు !

ఆనాటి విరజ ఆ భగవానుని బాహుబంధనంలో ప్రణయమూర్తి ! ఆ స్వామి

వల్లెసిను

అలాంటి విరజ కన్నులలో వికసించిన ఆనందాన్ని చూసిన కృష్ణుడు ముగ్ధుడయ్యాడు. ఆ ముగ్ధత్వంలో మెరుపు. ఆ మెరుపులో దివ్య స్వరూప సందర్శనం. ఆ ఆకారరహిత సందర్శనంలో జ్ఞాపికలు.......అందులో అప్పటికే రాధను కలుసుకోవలసిన సమయం మించిపోయిందనే భావనవొకటి .......ఆదే కదలనీయని స్థితిలోని-సంచలనం.....ఆ వేళ రాధను విరజలో చూస్తున్నట్లనుభూతి పొందాడు. "విరా! అనబోయి రాధా! అన్నాడేమొ" అనే అనుమానమూ లేకపోలేదు. అలాంటి మాట వెలువడినా విరజ గుర్తించే స్థితిలోనూ లేదు. అదేమి లీలయో గాని, రాధను విరజ కుటీరంలోనే చూడాలని వుంది కాబోలు. " లేశమైనా," మిగిలిన "యీసు' ' చూర్ణం కావాలని వెన్నుడు వేసిన యెత్తు......కాకపోతే, కాలహరణంలో ఈ పశ్చాత్తాపమేమిటి ? ఈ జాగు దేనికి ? ఈ స్థంభనకు యమునా తీరంలో వున్న రాధని హఠాత్తుగా "కృష్ణమాధుర్యం" పిలిచిమేలు కొలిపించింది. కృష్ణా! అని దిక్కులు మారు మ్రోగేలా పిలిచింది. ఆ వేళ రాధ! కుంటుంబిని రాధ! గృహిణి రాధ! సామాన్య వనిత రాధ! భక్తి శ్వేతార్ణవంలో అలలకూడలి రాధ ! కళా ప్రతిమల్లో భగ్న సంచలిత రాధ ! భువనైక మోహన కాంతిలో భ్రమితాంశువు రాధ!..........నిర్ణీత వేళా సహిష్ణుత తిరస్కార రాధ!.......చురచుర లాడింది. తనలో విరజా స్వరూపం మెదిలినట్లుహించి చరచరాసాగింది.

విరజ ద్వారం వద్ద సు[illegible]ముడు (కృష్ణుని స్నేహితుడు) రాధను అడ్డగించాడు. గాలిలా కుటీరంలోకి [illegible] వెళ్ళింది రాధ. అయినా రాధ ప్రవేశించడానికే అడ్డంకులూ వుండవని పాపః ! సుధాముడెరగడేమో ! ఎలాగైతేనేం ! నిర్ణీత కాలచోరుడూ నిదాన కాలప్రభావుడూ నీల మోహనుడు మాత్రం నెమ్మదిగా నిష్క్రమించాడు నిశాంతావరణంలో సైతం తన దివ్య తేజోరాశిని నింపుతూ ......కృష్ణుడు వెళ్ళి పోయిన ఛాయలు ఎవరికీ అర్థం కాలేదేమో!..........!

రాధామూర్తిని నిలువెల్లా చూసింది విరజ. ఆమెలో ఏ అలజడీ వున్నట్లులేదు. పవిత్ర ప్రేమ గురువుగా తనకి అభిషేకం చేయబోతున్నట్టు ధరించుకుంది.

అనంతమైన శక్తిగల తపోమహిమచే అలవడే వేదాంత జ్ఞానం విరజలో చోటు చేసుకుంది. ఆమెకు రాధిక......"కదలుతున్న వొక ప్రాణిగా ప్రాయోపవేశ సమయంలో దైవాన్ని సంస్మరించగా పటాపంచలైన ఆశగా స్ఫురించింది. కలచెదరిన మాదిరిగా వున్న పరిస్థితికి ఏ వొక్కరూ చింతించడంలేదు సరికదా ! ఎవరికి వారే తన్మయులై పరస్పరం కృష్ణ మాధుర్యాన్ని అనుభవిస్తున్నారు. ప్రకృతిలోని ప్రత్యణువూ కృష్ణమయమే వారికి. వారు నిలిచిన చోటు ఒక ఆలయ ప్రాంగణంలా ఉంది.

ఎంతో బలీయమైన ఆర్భాటంతో ఓ రమ్య ప్రతిమను ప్రతిష్టించినా భగవంతుడికి అహోరాత్రులు అందుండడం సులభమనడం తప్పే మరి.

ఎక్కడ భక్తికి మూలస్థానమో ఏది నిర్వికారమై అచంచల భావమనో నిక్షిప్తమో అక్కడకదలక వుంటాను. ఎవరు దేవుని నీడను విడువక సాధించగలరో...వారి ప్రాపును విదిలించుకోమన్నా వదలని స్థితిలో స్థిరతలో కూర్చుంటానని అంటాడు' ' విరజ ఆలోచిస్తోంది ఉన్మాదిలా.

ఏదీ ! ఈ మాట యెవరితో అన్నాడు.......ఛ! సుస్నేహితుడగు సుధాముడితో కదూ! ఓ.........!ఏమో! క్షణక్షణానికి నామనోరథం మారుతోంది. ఇప్పటిదాకా నా స్వామి! నాముందు............ఆహా! యిప్పుడు కూడ. అహో! రాధాసహితుడై...కృష్ణా! నేను తరించాను. ఏకాంత వాసుడవే కాదు. అనేకాంత వాసుడవుగా కనుపిస్తున్నావు. అనుక్షణం.....నీ పాదాలు నా కన్నీళ్ళకందడం లేదు ప్రభూ! నేనెలా నిన్ను.......స్వామీ! మాధవా!నీ మాధుర్యంతో నామనసంతా తేలికగా ఆవిరై పోకూడదు. కరిగి నీ పాదాలనే ప్రక్షాళనం చేయాలి. నీ వియోగంలో. యీ నిర్లిప్త సంయోగంలో....సంధిమాటలకు నాఆత్మ మనస్కరించడం లేదు. నిలువునా... నా స్వరూపం నీలో లయించాలని. అంతదాకా పట్టువీడని వీరజ యీ విరజ. అంతదాకా వెనుకాడని, వాడని నీరజ ఈ విరజ. అంతే...అంతే......అలా తన్మయత్వంలోకి జారి కృష్ణచరణాలనంటుతూనే విరజానదియై ప్రవహించింది.

"ఆ మాధవ మాధుర్యం" అజరామర పీయూషమై, భావితరాలకు ఉపయుక్తమగుగాక". అంటూ సాగిపోయిందా ప్రవాహం.

అంతకు క్రితమే రాధభాదతో విసవిసావెళ్ళిపోయింది. ప్రేమమూర్తులైన ఆ పడతుల మధ్య కృష్ణుని ఆంతర్యం సలసలా కాగింది. వాహినియైన విరజను మోహించిన కృష్ణుడు నదివద్ద భక్తివిరహబాధాపీడితుడై సంచరిస్తాడు.

నదీరూపందాల్చిన స్త్రీమూర్తియైన విరజ ఒకరోజు శ్రీకృష్ణునిజేరి కౌగిలించు కుంటుంది. ఆ స్పర్శలో ఆమె అనుభవించిన "సుఖం" పునీతమై ఏడుపురుళ్ళు పోసుకుంటుంది. సప్తసముద్రాలని పేరుగాంచిన సుతులీమె గర్భోన్నతిని చాటుతారు.

అన్నట్లు పరమాత్మ ప్రవేశకమూ నిష్క్రమణమూ అత్యంత చిత్రమైంది.భక్తీ శక్తులమధ్య సంఘర్షణ భక్తిని నెరపించి శక్తిని పెంచి అసాధారణస్థాయి నధిగమించిన తరువాత అణచుట అత.నికే చెల్లును. తుదివిజయం భక్తి దైనా-శక్తిలోని నిండుదనాన్ని పుంజుకుని కూడ బలహీనమగుటో, పట్టుదల పెంచుకుని త్యాగం దాకా పర్వించుటో, పవిత్రతనే నమ్ముకుని నిశ్చలస్వరూపియగుటో జరుగుతుంది. అంతవరకూ "తను-మనం" వేచివుండాల్సిందే. ఎంతచిత్రం!" అన్నీ మ్రింగి అవనికి కృంగిన విధం ఆలోచించడంలాగ"!

ఏకాంతంగా వున్న కృష్ణుడి మనస్సు ఆవేదనతో వుంది. ఇలా ఎందరి మనస్సులనో అపహరించి వారి పట్ల వైముఖ్యం ప్రదర్శిస్తున్నందుకు మథనపడ్డాడు. గతంలో కొన్ని తలపులు మరుగుతున్నాయి.........రోహిణీ వసుదేవుల సంతానంలో సారణుడు గణనీయుడు. వంశోన్నతిని చాటిన ప్రముఖులు మాత్రమే కాక, యిలాంటి వారి మాటుపాత్రలు కూడ అనుబంధంగావుండి భగవానుడి ఔన్నత్యాన్ని పాడుటకుపకరించాయి. చిన్నతనం నుండి సారణుడి తత్వం అంతంతమాత్రమే అయినా, కృష్ణుడికి తనపట్ల వున్న అనురాగం గొప్పది. గోపాలనలో అనుక్షణం సోదరులకందించిన సమాచారం.......బలీయమైన, లోక విదితమైన క్రియలకు రూపుదిద్దింది. బకుడు, శకటాసురుడు, సంహరింపబడునప్పుడు సారణుడు

"నిమోనదీక్షా పరతంత్రతకు ఆనందించాను. ఇక ముందు నువ్వు నా అనంతరం కార్యక్రమములందున్నత పాత్ర వహించవలసి వుంటుంది. ఇన్నాళ్ళు నిన్ను గుర్తించనందుకు సిగ్గుపడుతున్నాను సోదరా"! అంటూ అభినందించాడు. ఆవేళ సారణుడు, కృష్ణా! నన్నిలావదిలెయ్. నాకు యింతకన్నా పని గొప్పదంటూ వుండదు. ఉంటే, యీతృప్తి కూడ మిగలదేమొ! అలాగే..........!అలాగే యింకా యీ తృప్తి యేమిటో ప్రభూ!

కృష్ణా! అందరిలా నేను మీ దృష్టికి అందకపోవడం వల్ల లోకం నన్ను గుర్తించలేదనే బాధకన్నా, నీ ముందు అవిధేయుడనేమోయనే అనుమానం యిప్పటిదాకా పీడించినందుకు చింతిస్తున్నాను. ఎప్పుడూ నా కింత మాత్రమైనా అభయహస్తం చూపించవేమోనని కూడ నేనెప్పుడూ వూహించలేదు. జగద్విదుడైన స్వామి చరణాలలో నేనున్న స్థానం గొప్పదిగానే భావిస్తూ కాలం గడిపాను. కాకపోతే, గతంలో నేను చేసుకున్న కర్మ నన్నడ్డగించి ఎదురుగావున్న సౌభాగ్యాన్ని అనుభవింపనీయలేదు. ఇప్పటికీ సోదర జన్మవల్లనే నేను తరించాననుకోవడం లేదు ప్రభూ! సారణుని కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

"సారణా ! నీ ఓర్పు మహోన్నతమైనది. అభిమానేతరులనే పలుకే నావద్ద లేదని నీవు గమనించిన తీరుకు కృతజ్ఞుడిని".

ప్రభూ! క్రియలో నానడత గమనించిన తండ్రి అనేక సార్లు నా గురించి వాపోయారు. మీకు నివేదించి నాపుట్టువు యీ యుగంలో గుర్తించగలందులకై తపించారు. అవివేకిని నేనై వున్నప్పుడు" కృష్ణుడి నిర్లిప్తతను మందలించి సాధించ ; ఉచితం కాదని పోరుపెట్టుకున్నాను. అయినా ఒకటి రెండుమార్లు మీకు నివేదించడ: పడితే, నా నోముకు మధ్యలోనే అంతరాయం కలుగుతుందని తలచాను. దైవికంగా ఆయన్నలా మందలించడంతోనే మానుకున్నాడు. కృష్ణా! దేవదేవా! "శుచివస్తువు' 'గా యిప్పటికైనా స్వయంగా గుర్తించబడినందుకు ధన్యుడిని. ఇదే నేను మొదటి నుంచీ కోరుకునేది.

సారణుడి ఆంతర్యం చల్లగా వుందని గుర్తించిన కృష్ణుడు పశ్చాత్తప్తుడయ్యాడు.

మదనగోపాలుడి మేధస్సు పొగడచెట్టు క్రింద మెరుపు కలగా మారి, తన అశక్తతకి చింతిస్తోంది. అవును ! అన్నీ నిర్వహించడంలో కొంత తప్పుచేశానేమోయనే శంక తనకెందుకుందో వూహిస్తే కష్టమే మరి !

ఆలోచించసాగాడు కృష్ణుడు.

"ఆదిలోనే అన్నిటికీ మూలమైన కొన్ని జన్మలు యెప్పుడూ తనతోనే సంచరిస్తున్నాయి. అంత్యము చూడగలిగే ఆ జన్మలకు తాను అనాలోచితంగానే దగ్గరి వాడవుతున్నాడు. కొందరి పట్ల నిర్మోగమాటంగా, ప్రవర్తించడం తన కలవాటే కాబోలు. అసలీ అవతార విశేషమే అంత. మరి కొందరి యెడల తాను చూపుతున్న నిర్లిప్త వైఖరి అప్పుడప్పుడూ పట్టి వూపడంతో తనలోని అవ్యక్తవేదనాభరిత భావాలు కదలుతున్నాయి. ఏమో! సృష్టించబడిన యుగమే సృష్టి కర్తపై తిరగబడుతోంది...ప్చ్ ! ఎంత పాత్రయినా సమర్ధనీయంగా నిర్వహించినంత సంతృప్తి మిగలడం లేదు. చివరికి యిలాంటి బాధతోనే అవతారం చాలిస్తే అనుయాయులు వగచుట, అవివేకులు హసించుట, భక్తులు భయపడుట, అహో ! ఏమని చెప్పగలం" ? శ్వాస గట్టిగా వదలి వరుసగా నాలుగు నిట్టూర్పులు విడిచాడు వంశీధరుడు. రివ్వున గాలివీచి ఆ నిట్టూర్పులని ఎత్తుకు పోయింది.

నిశ్శబ్దం.......!

ప్రభూ.....!

ఎవరది......!

నేను ప్రభూ!.......నేను........వాయువును. దిగంత వ్యాప్తంగా వుండి వూపిరి నిలిపి, మీ మనోవేదనగని...మిమ్ము ప్రసన్నులను చేసుకోవాలని వచ్చాను. కాదు ఆగిపోయాను. ప్రభూ ! మీరే యింత దిగులుపడితే......ఆవైపు చూడండి! నారాక కొంత యాలస్యమైనందుకు చికాకు పడుతున్న జనం!

మీ కోసంనేను స్తంభిస్తే.........నా కోసం.....వారు యింకా....నా వంతకాంద్రు (పంచభూతాలలో మిగిలినవి) మీ వల్ల ఆగిపోతే.........జనం..........!ఏమి యీ నిశ్చలత! ఏమి యీ తపోనిష్ట. మీ యానతిపండి, జగమంతా నిండాలి ప్రభూ!

కాని యేమి యీ నిర్లిప్తం...! ?

ఊఁ! సమీరా! కర్తవ్యబోధ చేస్తున్నావు!

ప్రభూ అశక్తులం!........!అశక్తులం..!

"కాదు"! శక్తి ధరుడివే! కాని.........!

"మీ యిష్టం"!

గలగలనవ్వాడు కృష్ణుడు సాగిపోతూ.....!

మెల్లగా సాగాడు మలయానిలుడు వెనువెంటనే...!

××××××

# 5

సకల విద్వజ్జన సౌశీల్యమననంలో మహనీయుడూ, మాన నీయుడూ అయిన మదనగోపాలుడు తన "శృంగార విపంచి"ని మీటి, సూటిగా జన సంచారంలో ఎనలేని దిగ్భ్రమను కలిగిస్తాడు. ఆ నాద ధారా వాహినీ ప్రకంపనలు అనేక జీవసౌధాల్లోకి ప్రాకి, చలనరహిత శ్రవణేంద్రియాలను జలదరింపజేస్తాయి. శృంగార రసభరిత వాసనలంటూ యుగయుగాల్లో ప్రతిఫలిస్తున్నాయంటే, ఆనాటి ఆ వీణియపై మీటిన "లయ" ప్రతిరూపాలేనేమో యనే ఆనందమూ, ఆశ్చర్యమూ కలగకపోదు.

గొజ్జంగినీట మజ్జన మాడి మదన సామ్రాజ్యానికి పట్టాభిషేకం కట్టుకున్న మురళీధరుడు వ్రేపల్లెలోని ప్రతియింటా చందమామలా వెలిగి పోవడంలో తప్పులేదుగాని, వేడి మాటలతో అంతరంగాలు మరిగించి, మరుభూమిలాంటి మనసుల్లో మల్లెవనంలాంటి చల్లని అనుభూతిని సృష్టించి మాయమైతే, మనలేని గోపసతుల ఆవేదన తప్పు-అనే శృంగారం మాత్రం పుష్కలంగా అభివర్ణించిన కావ్యాలు కోకొల్లలు ఇది విరహంలో నిక్షిప్తమైన శృంగారావేదన. ముద్దరాళ్ళను మురిపించి, వృద్ధురాళ్ళను ఉడికించిన గోపాలుడికీ జగం జేజేలు పలికింది. అందుకని అందరికీ అమృతమూర్తిలా గోచరించినట్లు వచించినంతమాత్రాన పైవిషయానురక్తులను కించపరచినట్లేయని భావించుట శుద్ధాపరాధమని భక్తజనవాదముగదా ! ఆమీదట.

ఏ భక్తుడైన శుష్కప్రవాదమును సైతం ఒక అత్యున్నత కీర్తికార్యంగా తలంచి, "స్వామికృత లీలా మహోన్నతి"నే, సులభంగా చాటుతాడు. శృంగారి-తన దృక్పథంలో మెరిసిన ప్రేమలీలాజగత్తును దర్శించినంతకాలమే తృప్తినిబొంది, పిమ్మట నీరసం ప్రకటించి "యోగి" అవుతాడు. అదే, భక్తుడూ శృంగారీ గమ్యమొకటే యైనా

కార్యం మాత్రం అనంతవాహినిని సాగదీస్తూనే భగవానుడి లీలాప్రభావంలో కలిసిపోతూనే వుంది.

(ఆప్రభావం పోతన్ననుండి వేమన్న దాకా భక్తి వేదాంత బీజాల్ని కలబోసి పాంథజన హృదయక్షేత్రాల్లో పరుస్తూనే వచ్చింది. బిగువుగా-బీదగా గాక, పూర్ణంగా పరిణతి పొందిన-నాటి "మోక్షసాధక లక్ష్యం" ముద్దుపళని నాటికి మోరలు సాచి బూరటించింది. శృంగారంలో వేదాంతం పెళుసుగా రూపు దిద్దుకుంది. ప్రేమ ఒంటిస్తంభపు మేడనుండి నడిబజారుల్లోకి దిగింది. శుద్ధము మిశ్రమమై చూర్ణము చేయబడి రంగుటద్దాల్లోపెట్టిన కొండపల్లి బొమ్మలా మారిపోయింది. అయినా .... సారహీనం అనలేం గాని నాలుగు దోసిళ్ళ నీటితో కలిసే రంగు నలభై దోసిళ్ళ నీటితో కలసి పోయిందనడంలో వింతలేదు.)

భగవానుడు భాగ్యవంతుడనీ శృంగార రసరాట్టనీ అనురాగ మూర్తుల భావనైతే, ఆద్యంత రహితుడూ, అనంతలయుడూ నిరాకారుడూ అని యోగుల భావన. అయితే యీ అనురాగమూర్తులూ యోగులూ అనుసరించే విధానాలు-వ్యత్యాసాలైనా గమ్యమునందు "తృప్తి-మోక్షము" అనుచోటనే అభిలషించడంలో భేద రహితులుగా చెప్పబడుతున్నారు. అందుకే ఒక అవతారానికి మరొక అవతారానికీ మధ్యగల తారతమ్యముననేగాక, ఒకే యవతారంలో భిన్నదృక్పథాల్తో సంచరించి, భిన్నభిన్న మనోప్రవృత్తులను ఎత్తి చూపడంలోనే భగవానుడు చూపిననేర్పు ప్రదర్శితమౌతున్నది. అదే రాధా, విరజ, కుబ్జ, గోపకాంతలు శృంగారారాధనలలోను, అక్రూర, కుచేల విదురాదులు భక్తి ఆవేశములలోనూ, గమనించ దగినవారు.

భక్తుడు తన సాధనలో స్థాయిని మించిననాడు ఆవేశం పెరిగినా, ఓర్పు వొరలను వొరుసుకుంటూ అనంతుడిలో లయమైపోవడానికి చేసే గట్టి ప్రయత్నమే "తపస్సు". ఆ ఓర్పు, ఆ తపస్సు ఫలించిన మూర్తులలో రాధ ప్రధమురాలు. కాని ఒక్కొక్కప్పుడు రాధలో కూడ అలాంటి బలహీనత ఉన్నట్లు చెప్పి. ఆ మీదట అర్థవంతమై-ఫలసహితమైనదనుటలోనే "సాంత్వనం" ఉద్భవిస్తోంది.

ప్రేమిస్తుంది. ఇష్టసఖిలా అనురాగం చూపుతుంది. రతీదేవిలా శృంగారం నేర్పుతుంది. ప్రౌఢగా శృంగారపు మలుపులు దిద్దిచూపుతుంది. భక్తురాలిగా కృష్ణతత్వం ఉపదేశిస్తుంది. చివరికి తనకు తానుగా ఇళాదేవిని కృష్ణుడికి ప్రియురాలిగా సమర్పిస్తుంది. తరువాత బాధపడుతుంది. ఈ బాధ ..... యీ మార్పు ఎక్కడనుండి ప్రవేశించింది? అనే ప్రశ్నకి సమాధానం తనకే దొరకలేదు. అదేపైనజెప్పిన ఆమె "బలహీనత" కావచ్చు. అనుక్షణం కృష్ణుడిలో జీవించే తన ధ్యాస ఎక్కడో దూరతీరాలకు తనని విడిచి పోయినట్లుంది.

ముగ్ధయైన ఇళాదేవి కృష్ణుడితో శృంగారలోకాల్లో విహరించి పూర్ణశృంగారిణియై ....... రాధకే ప్రబోధించడం మొదలు పెట్టింది. ఒకనాడు.

"రాధమ్మా! స్వామి నివాసం సర్వజన హృదయాల్లోనూ వుందన్నావుగా! ఇప్పుడు యేజామూనన్ను విడువడమే లేదుకదా"! అంటూ అమాయకంగా ప్రశ్నించింది. అందుకురాధ చిన్నగానవ్వి.

"నేనెవరికైతే కృష్ణబోధామృతం త్రాగించానో వారందరూ మొదటిసారిగా నన్నడిగిన ప్రశ్నయిదేనమ్మా! అంటూండగానే ఇళాదేవి తానిదివరకు విన్న భక్తుల దశలెట్లు పరిపక్వమైనవో తలచి, వారి పూర్వస్థితులు స్మృతికి తెచ్చుకుంది. అయినా ఆమెకు నిండుగా యేమీ బోధపడలేదు. కొంతసేపున్న తరువాత గంభీరంగా.

అంటే నేనూహించినంతమేర స్వామి ....... ! ఆగిపోయింది. "తప్పులేదమ్మా! అది సహజమే. "వినడానికీ, ప్రత్యక్ష సహచర్యానికీ మధ్యజరిగే సంఘర్షణ అది". క్రమంగా అదే అర్థమవుతుంది. అంటూ ఆమె ముఖంలోకి పరిశీలనగా చూసింది రాధ.

ఇళాదేవిలో సత్యభామ ఛాయలు ప్రస్ఫుటించాయి. ఏమీ అర్థంకాక దగ్గరగావచ్చి కూర్చొని రాధముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసింది.

అప్పటిదాకా శ్రీ కృష్ణుడు ఇళతో తిరిగిన వేళ, విశేషాన్ని తలచుకుని, కొంత చింతించి స్థిర మనస్కయైన రాధ, ఆమెదగ్గరగా వచ్చినంతనే అన్నీ మరచి ప్రశాంత చిత్తంతో యేవేవో చెప్పింది.

ఆ చెప్పడం తనలో తనకు ఎదురుగా కూర్చున్న ఇళాదేవిలో ఏమి మార్పు తెచ్చిందోకాని పరస్పరం కౌగిలించుకొని వొకరినొకరు ఓదార్చుకోవడంతోనే చాలాసేపు గడిచిపోయింది.

××××××

"సాంత్వనం" అంటే స్థూలంగా ఓదార్పు అనవచ్చు. ఈ ఓదార్పు పరస్పర సంభాషణతో ..... చెప్పడంలో కన్నా తనలో తాను పశ్చాత్తాపము పొంది, ఊరట జెందడంలోనే శ్రేష్టతవుంది.

పారిజాత సుమకలహంలో సత్యభామను, మధురలో కుబ్జనూ, మధురానగరినుండి వచ్చినపుడుగోపభామినులనూ, స్వయంగా తన తలిదండ్రులను కృష్ణుడు వోదార్చడం మన దృష్టికందే అంశాలు. అలాగే ఇళాదేవిని కృష్ణుడికి సమర్పించిన రాధ-తన కళ్ళలోవున్న వెలుగునూ, తన సర్వస్వాన్ని సమర్పించి నట్లు, పోగొట్టుకున్నట్లూ బాధపడి, చివరకు ఏకాంతాన్ని భరించలేక, యేడ్చిందనీ, ఆ కోపంలో "కృష్ణుడి నేంచేస్తానో చూడమనీ" ప్రతినలు కూడ చేసిందనీ - ఆ వెంటనే నీలమోహనుడువచ్చి ఆమెననేకవిధాలుగా వోదార్చితేనే ప్రియుడగు కృష్ణుని వక్షస్థలంపై వాలిపోయిందనీ చెప్పడం ........... !

నేనూ నా సర్వస్వం కృష్ణుడిలోనే వున్నాం. ఆయన తృప్తికోసం నేనేమైనా చేయగలను. అందుకే తనకిష్టమైన ఇళాదేవిని, "నాచేతులతో సమర్పించే భాగ్యం నాకు కలిగింది. ఇన్నేళ్ళుగా నేనుచేసిన తపస్సుకు ఫలితంగా నాలో ఎలాంటి యీర్ష్యా ద్వేషాలుత్పన్నం కాలేదు. చాలు ప్రభూ ! ఇప్పటికే ధన్యురాలిని. నీగురించి చెడ్డగా వూహించేవారి సాంగత్యం కూడా నాకు కలిగించకు. కలిగించినా వారు నాచే తిరిగి ప్రభావితులయ్యే విధంగా నన్నుమలచు. అంత ఓర్పు నాలోనింపు ప్రభూ"! అంటూ నిరంతరం చేతులెత్తి యాచించే "రాధిక" హృదయంలోకి భగవానుడునేర్పుగా నింపే తృప్తి ఫలితార్థం "ఓదార్పు" గా శ్రేష్టం కాగూడదా? ..... ప్ ........ !

అలా ఆమె ఆనందానుభూతిని పొంది, "తన సర్వస్వంతో నింపిన కలశం వొకటి, జగత్తును కోటి దివ్వెలతో వెలిగించే సౌదామినిలా చిత్రించుకొని, అనంతలయుడైన భగవానుడి చరణసన్నిధిలో వుంచగలుగుతోందంటే" మరి రాధిక, ముందుగా సాధారణస్త్రీయై, పిదప ప్రభువునర్ధం చేసుకుందనడం వుచితమా? కాదుకాదు. రాధ కృష్ణుడి జన్మజన్మల ఆరాధకురాలు. కృష్ణుడురాధకు, శాసించగల అనుపమాన శృంగార రససార్వభౌముడు మాత్రమే కాదు-చెలికాడు-సరసుడు-దేవుడు-సర్వస్వమూను. సర్వము అంటే-రాధయే స్వయంగా వెదకి పట్టుకొని సర్వస్వంగా జేసుకోలేదు. ఆమె ఆరాధనలో ముగ్ధుడై తానుగా ఆమెలో జీవించి నిండిపోయాడు.

ఆ ప్రణయం .. ధరించిన వస్త్రం లాంటిది. శ్వాసించే శ్వాసలా ఆగిపోనిది. కర్ణుడి శరీరకవచంలానైనా విప్పరానిది. తుదకు వజ్రానికి సైతం భేదించనలవి కానిది. క్షమా రహితమైన కార్యానికి తానెన్నడూ పూనుకొనలేదు. అందుకే ఆమె నోదార్చ వలసినవారు భూమండలంలోలేరు. "అన్నిటికీ తనలోనిండిన ప్రభువే మూలం. తనచేతయేది చేయించినా దీనిఫలితం ఆయనకేచెందుతుంది". అంటూ నిటూర్చేది కాని, ఆమెలోవున్న నిర్విణ్ణత అప్పుడలా మొండికేసినా, పిదప తనకర్తవ్యంతో నిండిన కార్యంకూడ భగవానుడిని ప్రసన్నుడిగా చేసుకోవడానికి ఎంతో ఉపకరిస్తుందని నమ్మేది. అదీ రాధాస్వరూపం. రాధా! అనేపిలుపుకు అర్ధం, "రా"శిలో నుండి "ధా'
'రగా నిరంతరం సాగిపోతూ దివ్య ప్రేమికులకు ఆదరంతో పంచే అమృతాంశఫలము. అనడం తప్పు కాదు.

భాగవతులనబడే మధుర హృదయులు సైతం మంగళగీతానికి ముందు స్తోత్రమూ, వెనుక అభ్యర్థనా వుండకుండా భక్తులు కాలేదేమో! అందుకే ముందుగా సిద్ధం చేసుకునే పూజా తతంగమంతాను.

సామాన్యుడికి ప్రశాంతత యేర్పడాలంటే, దేవుడి ముందు ఎన్నో ఉచితమైన వస్తుసముదాయాన్ని శుభ్రంగా చేకూర్చాలనీ, ఆసేకరణలో చిత్తశుద్ధి అవసరమనీ, అన్నీలభ్యం కాని పక్షంలో కొంత విసుగూ, ఓర్పులేకపోవడం స్పష్టమేననీ, నమ్మకం.

అలాంటి నీరసక్రియలు అంతమైతేనే స్వామి పూజలో తృప్తిని చూడగలమనడం చిత్రమేమరి. పోతే, మునిలా కూర్చుండి నిరాకారుని సేవించేవాడికి కూర్పులతో పనిలేదు. తనలో ఎలాంటి లోపమూ వున్నట్లు భావించడు. అందువల్ల ప్రతిఫలాపేక్ష లేనివాడు యితడే యనబడుతున్నాడు. అన్నిటిని మించీ ప్రతిభ, నిండుదనం పూర్వ జన్మసుకృత సముపార్జ్యం కావాలి. వీటికి తోడుగా సంఘదృష్టిపై నేర్చుకొనిన జ్ఞానమూవుండాలి. ఆమీద అభ్యసన ...... సాధన .........!

ఈ ఆధునికత్వాన్ని పులుముకునే పనులతో రాధకు పనిలేదు. ఆమె ఊహాసుందరి. స్వప్నజగత్తును నిలిపివేసి, నిర్లిప్తంగావుండి సృష్టి లయకారుడితో తనకేమీ తెలియనట్లు సంచరించగలదు. పంచభూతాలే-ఆమెకు నిదానంగా చెప్పగల సామర్థ్యము గలవి. వారే తనకు హితులు. అందులోనే ఒక్కొక్క రూపంలో వొక్కొక్క సారి తన ప్రభువు కనిపిస్తాడు. కదిలిస్తాడు. శాసిస్తాడు, అన్నీ-కృష్ణా ! అనే మధురస్వనంలో మిళితం చేసుకుని ఆస్వాదించి, యమునా తీరంలో, తమాలవృక్షచ్ఛాయల్లో, అర్ధనిమీలిత నేత్రాలతో అలా ...... అలా ....... ! ఎన్నోక్షణాలు ...... రోజాలు ...... ఎన్నో యుగాలు ....... ఆమెలో కరిగిపోతాయి.

అలా నిరవధికంగా సాగిన తపస్సుతో "రాధిక" పొందిన అనుభూతి చెప్పరానిది, "ఆశ ఉబికి అమితానందంలో ఉయ్యాలలూపి, అనంత తీరాలకు మోసుకుపోయిందే గాని విరహసంద్రంలో ముంచలేదు. అలాంటప్పుడు తననెవరు ఓదారుస్తారు? నీలమోహనుడు తప్ప. ఇలా దైవికంగా పొందినా అద్భుత సాంత్వనమ్మే మరి భౌతికం మాట !! అందుకే ఆదిసామాన్యులలోకి చొచ్చుకుపోవాలని మల్లచ్చిన తీరుగనకనే, బాహ్య స్వరూపంతో కూడివుంది. కాని, "అంతస్సౌందర్యమే సౌందర్యం", దానిచే (బాహ్యం) సాధ్యమైనప్పటికీ సాంతం సాంత్వనమే. ఇంతెందుకు? ఆ అనుభూతిలో ...... !

స్వామి స్వరూపమే సాంత్వనం !

అనూహ్యంగా ఆయన్నుండి పొందగలిగే ప్రతి సంతృప్తిలోనూ ఆయన ఓదార్పు ఛాయలున్నాయి ..... ఆ ఛాయల పర్యవసానమే సాం ... త్వ .... నం!

××××××

" కలతపడిన హృదయం విలవిల్లాడి తేలికపడి, కొంత సేపటికి పొందే ఆనందమే ఆనందం. ఆరాధనలో విసుగూ నిరాశా..... ఆ తరువాత ఆశ్చర్యమూ సంభ్రమమూ కలిగితేనే చివరిస్థాయిలో ఆనందం వెల్లివిరుస్తుంది. దానికోసంచేసే ప్రతి పనితోనూ దైవానికి సంబంధం వుంటుంది. కొంతకాలం అది ఆయన నిర్లిప్తతకు గురైనా, చివరికి చక్కని ఓదార్పులో సంగమిస్తుంది. ఆ ఓదార్పువలన ఉద్భవించిన తృప్తియే సాంత్వనం. ఇదిసత్యము. ధ్రువము" అంటూ దేవకీవసుదేవులకు యింకా ఏవేవో ప్రబోధిస్తున్న నారదుడితో హఠాత్తుగా

"అందని అమృతఫలంలా, కన్నయ్య మాకెందుకు దూరంగా వుంటున్నాడు. చెప్పగలరా"? అని దేవకీదేవి అడిగిన ప్రశ్నకు వూపిరిసలుపలేదు నారదునికి ......... చివరికి, .... తల్లీ! "పాలన" కోసం స్థలం మార్పించుకున్న ఆదిదేవుడు, కృష్ణుడుగా మీ సాన్నిధ్యంలో నిండుదనాన్నే మిగిల్చిపోయాడు. ఆ తరువాత మీ తపోమహిమకు, ఆవేదనకు ప్రతిరూపంగా ప్రతిరోజూ మీకళ్ళల్లో కనిపిస్తుండగానే దూరమయ్యాడనుకోవడం శుష్కం కదమ్మా!

మహర్షి! దూరమంటే ఎక్కడికి? "మారాతలిట్లున్నాయనే" గోప భామినుల తాత్కాలిక నిట్టూర్పులు చూడలేక, "భక్తజనలోలుడుగదా! అని ఎంతచెప్పినా వినిపించుకోని యీ భామలముందు కొడుకు అశక్తతను ఒప్పుకోక తప్పిందికాదు. (అశక్తతంటే ..... వారి దృష్టిలో తృప్తిపరచడంలో కొంత జాప్యమనే అర్థం.) నాపరిస్థితిలో

భరించలేక అలా వాదనకు దిగి కొందరి శుచిమనస్సులను ఛిద్రం చెయడంలో తప్పులేదు. కాగా అన్నిటిని నిర్వహించడంలో ఆమాత్రంలోపం దైవంలో వుండవచ్చుననే విచక్షణ యే వొక్కరికీ లేకపోవడంలోనూ తప్పు లేదుకదా''! అంటూవసుదేవుడు శూన్యంలోకి చూశాడు.

ఆయన మరోలోకంలో సంచరిస్తున్నట్లున్నాడు.

"ఈ తల్లి దండ్రులనే కదిలించివేసిన సంఘటనలు కూడ గోకులంలో వున్నాయన్నమాట'' ఆశ్చర్యంగా దేవకీదేవి కళ్ళలోకి చూశాడునారదుడు.

సన్ననినవ్వుతో ఆమెయెంతోసేపు మౌనంగా వుండిపోయింది. ముఖం గంభీరమై, ఎంతోసేపు అలాగే నిలిచిపోయిన కళ్ళతో, వయసుమళ్ళిన శరీరంతో వసుదేవుడు ఆవిశాలమైన పచ్చికపై పడుకొనివున్నాడు. పూలకోసంవనంలోకి వచ్చిన గోపికలు వీరిని చూస్తూనే వెళ్ళిపోయారు.

"అభయం'' యివ్వడంలోనే ఆలస్యం జరిగితే అంతలా నీరసపడి పోయేవారు, సత్ఫలితాల్ని చూడకుండానే ఆవేశపడుతున్నట్లున్నారు. సర్వవేళలా ఆప్యాయత నింపుకుని వొక్కరిపట్లనే భగవంతుడు నిదానంగా ప్రవర్తిస్తే, జడత్వాన్ని జీవంతో నింపడంలో పరిపూర్ణంగా ఓడిపోతాడుకూడ. అలాంటప్పుడు హిమాలయం, మేరువు-ఇత్యాది ఉన్నతగిరుల పుణ్యప్రదమైన స్థలమహిమల్ని గణించే శక్తి సామాన్యుల వూహకందదు గదా''! నారదుడు సాలోచనగా అన్నాడు.

"అందినా అందకపోయినా వాని మహిమ బ్రహ్మాదిదేవతలెరుగుదురు. అతిసామాన్యులకు ఆ-జ్ఞానం-వాని ఔన్నత్యం తెలియకున్నా కొఱతలేదు. ఎటొచ్చీ కృష్ణయ్య లీలామృతమే దప్ప, ఈ ద్వాపరయుగ ధర్మంలో అన్యమును కాంక్షించనివారే సామాన్యులు. వీనిలో మిగిలి పోయిన అస్తికతే వారు సర్వదా కోరుకునేది. ఇంచే అణుమాత్రమైనా వారు అర్థం చేసుకునేలాచేసి తృప్తిపరచడంలోనే

కృష్ణయ్య బాధ్యత వుంది. అంతకన్నా పెద్దగా మనం ఆశించినా, అర్థించినా శూన్యమే'
'. అంటూ దేవకీదేవి కళ్ళుమూసుకుంది.

"నిజమే !చలనం-అచలనం అనేమాట అటుంచి, వారు ఆశించినది వాక్కు క్షణ కాలం చూపించడంతోనే సరిపోదు. నిండుగా అభయం యిస్తూ వారి మూగతనాన్ని అశాశ్వతం చేయడంతోనే నీలవర్ణుని బాధ్యత పూర్తవుతుంది నారదా'! వసుదేవుడు ప్రశ్నార్ధకంగా చూశాడు.

మీరిద్దరూ అనేమాటల్లో భిన్నత్వంలేదు. కాగా అంతటిపని చేయగల శక్తి ప్రభువుకు లేదనికాదు. గతానుగత కాలసంబంధమైన యోచనను చేయడం అంటే కొంత గణన కావాలి. ఎవరెవరి పుణ్యమెంతెంతవుందో ఆయాపాళ్ళలో వారికందించడమే యోచించుకునే భగవానుడు, యింత సులువుగా పరిష్కారంచేసి మనల్ని మెప్పించలేదుకదా! అలామెప్పించిన నాడు ఆయనదైవత్వంప్రిదిలి (వర్షించి) అందరిపై చల్లని జల్లులే కురిపిస్తుంది. కాని ఆనాడు " శిక్ష-రక్ష'లకు అర్ధాలు పోయి, కేవలం అన్నిటికీ "రక్ష" అనే పేరు మాత్రమే మిగులుతుంది. ఇది మాత్రమెలా సాధ్యం?

నారదుని మాటలకు ఆదంపతులు ఏమీ మాటలు రానివారివలె మౌనం వహించారు. "నిజమే" అనే భావన వారి అంతరాంతరాల్లో మెరిసి మాయ మయింది. అలా ఎంతో సేపు వారు అక్కడే నిశ్చలంగా వుండిపోయారు. క్రమంగా సమాధ్యవస్థలోకి జారుకున్నట్లుగావున్నారు. కాలం ఎవరికీ తెలియడంలేదు. నారదుడు "మరినాకుసెలవిప్పించండి" అనేవరకు యీలోకంలోకి రాలేకపోయారు.

సాయం సంధ్యారుణ కిరణాలు పచ్చికబయలుపైపడి బంగారుపూత పూస్తున్నాయి. చెట్లపైనున్న పూలు ఆ కిరణాల్తో మెరిసి, తమలో వినూత్న వర్ణములను సంతరించు కుంటున్నాయి. పక్షులు గూండ్లకు చేరుకుంటున్నాయి.

"ప్రభూ! పశువులిండ్లకు చేరుకుని వుంటాయి"! అని దేవకిదేవి కర్తవ్యం గుర్తుచేసింది. "పద" అంటూ లేచిన వసుదేవుని చేయి పుచ్చుకుని నడుస్తున్నదేవకీదేవి,

మంచుకొండ అంచునేమొలిచి, ఆ కొండనానుకుని, తెల్లని పూలతో నిండివున్న కొండమల్లెవృక్షంలా వుంది.

మహనీయుల సంభాషణ వింటున్న వాయుదేవుడు వేగాన్ని పెంచి రివ్వుమన్నాడు. ఆవిరిలా చీకటిని కురుస్తున్న రాత్రి ప్రమత్తయై కాటుకనే వర్షించింది. నిట్టూర్పులు విడిచిన నింగి నిర్మలమై చంద్రుని రాకకై ఎదిరిచూస్తోంది. బహుళపంచమి రాత్రి గనకనేమో కొంతకాలం ప్రకృతి చిమ్మచీకటిని భరించింది.

××××××

తూర్పు దిక్కు తెలుపును పులుముకుంటోంది. మరికొంత సేపట్లో యాదవనగరు శ్వేతద్వీపమై ప్రకాశించింది.

"కాలధర్మమే చీకటివెలుగుల కలయిక. కాలంలోనే కమనీయ మూర్తి కర్తవ్యమూ చేష్టలూ వున్నాయి. అర్థం చేసుకోలేని ప్రాణులు తమలో తాము అసంతృప్తినీ సృష్టించుకుని బాధపడడం సహజం. నిశ్చలంగాసాగే ధర్మం యేకుదుపుకూ చలించదు. చలించిన నాడు ధర్మంలో పొడుకొనివున్న పోకాటు విరిగిపోయి గమ్యం చేరికలో కొంత ఆలస్యాన్ని పొందుతుంది. ఆనాడు మళ్ళీ అవగాహన తోపించి అసంతృప్తిలో మునుగుతుంది యుగం.

నైర్మల్యంలేని జీవి యెప్పుడూ ఆశాజీవిగానే మిగిలి పోవడంతోనే కష్టాలు కూడ మిగులుతాయి. ఆ నైర్మల్యసాధన కోసం పరిపూర్ణత కావాలి. పరిపూర్ణతలో "అపేక్ష" ఏంతమాత్రమూ ఉద్భవించకూడదు. నిలువరాదు. పరమనైష్ఠికుడు పామరునికన్నా తక్కువగా తన మూల్యాన్ని గణించిన నాడే అదిసాధ్యమవుతుంది. నిర్నిమేషంచేసే ఆ సాధనలోనే పరమాత్మ దర్శనం తప్పక లభిస్తుంది. అభయహస్తమిస్తుంది. ఆక్రోశించవలసిన దశమారిపోయి, ఆనందించే మార్గం గోచరమవుతుంది. ఈ దశలో సంలీనమై ఎంతో కాలంగా తనవాడుగా భ్రమించి తప్పునుతెలుసుకున్న సత్యభామ చివరికి ఆ అనంతరాశిని కనుగొని, ఆయన

అద్భుతనాటకానికి లొంగిపోయి. ఆశలు వదులుకుని యిలా అంది.

కృష్ణా! "యీ పుణ్యక వ్రతమేమోగాని పూర్వజన్మఫలితాల్ని శాశ్వతంగా నా కళ్ళయెదుట ప్రతిఫలింపజేశావు".

"అది నాతప్పుగా నీవు భావించినన్నాళ్ళు నీనమ్మకాన్ని కదిలింప నాకు శక్యము కాలేదు సత్యా! ఇందెవరితప్పు కాకున్నా కొన్నాళ్ళు మనం అనుభవించవలసిన బాధలు విధిగా అనుభవించాం. తప్పదుగా"! అంటూ పెదవులపైనున్న చిరునవ్వుని మరింతపెంచాడు కృష్ణుడు.

నిజమే ప్రభూ! నీలో ప్రతి కదలిక ఒకనిర్ణీతమైన కార్యసాధనకే ఉపయోగపడుతున్నదన్న సత్యం యెరుగని మూఢులకింత కాలంగా తగిన శాస్తినే చూపించావు. ప్రత్యేకంగా నా పట్ల చూపిన వైవిధ్యం కథకుచెరిగిపోని వెలుగు కదూ! అంటూనిట్టూర్చింది సత్య.

పిచ్చిసత్యా! జీవన ప్రమాణం ఒకేరీతిలో ఆనందంగా గడిస్తే నీకు నేను తెలిసేదెలాగ? కొంతకాలం నీ ఔన్నత్యాన్ని గని లోకం కూడ వూగిపోయింది. ఆవూపులో నేను నీకు నిండుగా కనిపించినా నువ్వుకూడ నమ్మలేకపోయేదానివి. అందుకనే కాలం నెమ్మదిగా మార్పులకు తావిస్తుంది. తారుమారులను సరిచేస్తుంది. అంతవరకూ నిరీక్షించవలసిన బాధ్యత మీ అందరిపైనా వుంది".

అంతే ప్రభూ! "రుక్మిణీదేవి విషయంలో నేను పొరపడ్డానని ముందొకసారి నా మనసుకు తట్టింది. అయినా బలీయమైన కోర్కెలు అహం- నన్ను ఆ వేళ నిలువనీయలేదు. ఆ పరమసాధ్వి తానుముందుగా పొందిన అనుభూతే యిప్పటిదాకా దాచుకుని మీసన్నిధిలో పసిపాపలా, పుణ్య సిద్ధిలా, పరమయోగినిలా మసలుతూం దంటే.... ఆహా ...... యింకా యోచించలేకపోతున్నాను కృష్ణా! ..... స్వామీ! ఆప్రసాదమే నాకు ముందుగా దొరకనందుకు చింతిస్తున్నాను .... ప్చ్! సత్యభామ కళ్లలో నీళ్లు నిండాయి!

"జన్మించిందిమొదలు యిప్పటిదాకా నీకది అందలేదు సత్యా! అందిన దల్లా కళ్ళయెదుట జరిగే సంఘటనలపై అధికార, శృంగార, ఆహ్లాదపరమైన పరిష్కారములు. అవీ చేజిక్కని పక్షంలో ప్రతీకారాలు....! వివేచనలేని కోప ప్రదర్శనాలు.

"కృష్ణా! భరించలేను. దయచేసి ఆచెప్పడం ఆపుస్వామి"! ఆమెస్వరం జీరబోయింది.

'అదిగో! అందులోనూ అధికారధ్వనియే" కృష్ణుడునవ్వాడు.

సత్యభామ కళ్ళల్లో నీళ్ళునిలిచి, ఆమెలోని పశ్చాత్తాపాన్ని ద్విగుణీ కృతం చేస్తున్నాయి. కొంతసేపు ఆమెలోవేదన, అతనిలో కుతూహలం చోటుచేసుకున్నాయి. రుక్మిణి గురించి ఆమె అర్థంచేసుకున్నంతమేర వూహిస్తే ..... శ్రీకృష్ణుడికి మరోసారి నవ్వుకూడ వచ్చింది.

ప్రభూ! మీరెంత నవ్వినా నాలో యింకాసెగలూ మంటలూ పుట్టవు. నాచిన్న తప్పుతో నా చరిత్రకే మచ్చ తెచ్చుకున్నాను. భోరునయేడ్చింది.

లేదుసత్యా! రుక్మిణి యిలాంటి అనుభూతిని పొందిన రోజులు ఈ జన్మకన్నా ముందు జన్మలోనే అధికం. అందుకే నింపాదిగావుంది. "ముందు" ఒకసారి తలచుకొని ప్రస్తుతాన్ని మరిచేస్త్రీమూర్తికాదు రుక్మిణి. ప్రస్తుతాన్ని ప్రత్యక్షంగా పూజిస్తూనే పరమపదాన్ని చేరుకోగలమహాసాధ్వి. ఆమెకీ ఓదార్పులు గాని, ఆశలుగానీ, అవి అందని పట్ల రవరవలు గానీ లేవు".

"అందుకేగదా ప్రభూ! ఈ యుగానికి కొన్ని మూలవిరాట్టుల వంటి పాత్రలు సృష్టింప బడ్డాయి. అవి అన్ని రాళ్ళవలె పడివున్నట్లే భావించినవ్వాళ్ళు వానికి తిరస్కారాలే ఎదురవుతాయి అని భ్రమించాం. కాని వానిలోని సమగ్ర స్వరూపం తెలుసుకునే సరికే మా జీవితంలో సగభాగం వ్యర్థమై పోయింది" పశ్చాత్తాపంతో

సత్యా! "చిన్నతనంలో" సిద్ధి"ని పొందడం కొందరికే సాధ్యం. అది అవసరమన్నచోట స్వార్థంకోసం, లోకకళ్యాణం పేరున వాళ్ళు సృష్టింపబడతారు. వారితో జరిగే కథల ఆధారంగానే వారికీర్తి దిగంతవ్యాప్తి మవుతుంది. అయినా యదార్థంగా "సిద్ది"ని పొందేదశ, వయసు నీకిప్పుడే గదా"! అనునయించాడు కృష్ణుడు.

ఆ మాటలు ఆమెను నిండుహృదయంతో ఓదార్చినట్లున్నాయి. "సత్యనోదార్చితే సత్యలోకమంతా నిర్మలమైందని" కృష్ణునిమనసు గొణిగింది.

"అంటే నావయస్సుకిది సరిపోయిందా ప్రభూ! ఆహా ఇన్నాళ్ళకు నన్ను నేను అర్థం చేసుకోగలిగానన్నమాట." నిర్వేదం ప్రకటించింది సత్య. "అలా అర్థంచేసుకున్నావు-చాలు"! తృప్తిగా ఆశీర్వదించినట్లనిపించింది ఆమెకు.

నిశ్చలంగా ప్రసన్నవదనుడైవున్న శ్రీకృష్ణుని చూసి నెమ్మదిగా వంగి పాదములంటి నమస్కరించింది. ఇప్పుడామె సజీవసౌందర్య రాశిలా, వున్నాననుకోవడంలేదు. శుద్ధ వల్కలములు ధరించి, పవిత్రనదీ తీరంలో, పుచ్చికతో నిండిన సుంధరవాటికలో కృష్ణస్వామిని సేవించే యోగినిలా తన్మయురాలైవుంది. ఆమె హృదయపుటంలో నిండిన "మాధవ మాధుర్యాన్నెంతో" కాలం తృప్తిగా అనుభవించింది.

ప్రేమగా ఆయన యెత్తిన కౌగిలిలోనే ఆమె పరవశించి, కరిగిపోయింది. ఆ వేళ శేషుడై పడగలెత్తిన కాలమే వారికి గొడుగులా మారిపోయింది.

XXXXX

# 6

విశ్వం ఎంతో విశాలం. విజ్ఞులు తమ వూహను పర్యింౘినంత మేర "విశ్వం' ' వ్యాపించేవుంది. దాని సమగ్ర స్వరూపం తాలూకు అన్వేషణ ప్రతి యుగంలోనూ మానవుడు సాగిస్తూనే వున్నాడు. ఎంతో కొంత సాధిస్తూనే వున్నాడు. అందని దాన్నీ అతీతంగా వూహించి, మలచి తృప్తిపడడంతో తనకు కొందరి సహకారమూ ప్రోత్సాహమూ లభిస్తుండగానే మరికొందరి తిట్లూ శాపనార్థాలూ ఎదురవుతూనే వుంటాయి. "అదివారి ఖర్మ" అని వదిలేసి, తన వూహాపథానికి మరో సోపానం నిర్మించడానికి తాను ప్రయత్నిస్తూనే వుంటాడు. తానొక నిమిత్తమాత్రుడుగా గుర్తించడానికి తాను ప్రయత్నిస్తూనే వుంటాడు. అలా నిమిత్తమాత్రుడుగా గుర్తించనంత వరకు తనకో ప్రతిభ అనే శక్తి వుందనే అనుకుంటాడు. అది తెలిసినా..... ఆ తృప్తి తనవరకే మిగుల్చుకొని ఆనందించవచ్చు. అదే అతనికి విశ్వసౌందర్యం అనిపిస్తుంది. ఈ మధ్య మరోయుగం మారక ముందే, ఆ విశాల విశ్వసౌందర్యాన్ని ఒక చోట నిక్షిప్తంచేయడానికి ఋషియై-కవియై కావ్యాన్ని సృష్టిస్తాడు. తద్వారా తనకు గల ప్రతిభాపాటవాన్ని లోకానికందిస్తాడు...

ఆ సృష్టికి మూలమైన భగవంతుడు-ఆకావ్యంలో నాయకుడైనప్పటికీ, కవి మల్చిన తీరుకు "ధర్మసంస్థాపన" చేసి తీరుతాడన్నది నిర్వివాదాంశము. దైవాంశ సంభూతుడు వ్యాసభగవానుడి కావ్యసృష్టిలో "ప్రకృతి"-తన సౌందర్యాన్ని కృష్ణ భగవానుడి ముందు నైవేద్యంగా పెట్టుకుంది.

ఆనాటి ద్వాపర యుగంలో కూడా శ్రీకృష్ణభగవానుని లీలా సందర్శనంలో అనంతమైన అనుభూతిని పొందిన భక్తులతోబాటు, యుక్తులు పన్ని, శక్తిని పరీక్షించి మృతులైన వారు చాలమంది. ఒక్క ద్వాపరంలోనే కాదు. అన్నింటా కనబడే హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులు, రావణకుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు, ఆ

కోవలోని వారే కదా! వారు ప్రకటించిన అసూయాద్వేషాలు వొకవిధంగా లోకకళ్యాణార్థమై చేయబడినవేయని చెప్పవచ్చును. గోవిందుని చరణారవిందాల్లోని ప్రత్యేకతను చూడదగినంతగా భాసించడానికి కారణం. ఆ దురాలోచన వున్నవారిలో కలిగే పరిదేవనం ప్రస్ఫుటించడమే పురాణకథా గమనం అవుతుంది. ఇదే మనం ఆయన అన్ని అవతారాల్లోనూ గమనిస్తుంటాం.

ప్రత్యక్షంగా దగ్గరగా దర్శించే సుందరసౌభాగ్యానికి నోచుకున్నవాళ్ళు ద్వాపరయుగంలో ఎందరో వున్నప్పటికీ, కొందరు విలవిల్లాడి పోవడం కూడ మనదృష్టికి అందకపోలేదు. అలాంటివాళ్ళు పంచభూతాల్లో - నక్షత్ర ఖచిత నీలాకాశంలో చరిస్తున్న సూర్యచంద్ర ప్రభల్లో-ప్రకృతిలో సంలీనమవుతున్న ఋతుచక్ర భ్రమణ గతుల్లో-ఎంతోకొంత సౌందర్యాన్నుపాసిస్తూ వచ్చారు. అంతటితో తృప్తి పడికూడ మోక్షప్రాప్తిని పొందారు. అది వారి అంతర్దశ సంబంధంతో ప్రపుల్లతనొందిన ఆత్మసౌందర్యం. ఈ ఆత్మసౌందర్యమే అనంత బిందువులై సకలప్రాణికోటి యెదలను ఆర్ద్ర పరుస్తోంది. (ఆ తేమలో నుంచే ఉద్భవించిన సౌమ్యత కోటానుకోట్ల పిలుపుల్లో జీర్ణించుకుపోయి రవీంద్ర కవీంద్రుని "గీతాంజలి"లో పొందుపరచబడింది.) అందుకే యుగయుగాలుగా దాని పరిమళం వినూత్నశోభనిస్తుందనడంలో అతిశయోక్తిలేదు.

అదిచైత్రమాసం .......... ఉదయవేళ.

జగమంతా ప్రశాంతత అలముకున్న రోజు.

దివ్యత్వం దిక్కులు పరచుకున్నరోజు. కుహూ అంటున్న కోకిల స్వరంలోని ..... పరవశం ప్రవహించి ప్రాకుతున్న రోజు. రివ్వున వీచే గాలి శబ్దమేతప్ప మరేమీ వినిపించడంలేదు. ఇగుళ్ళు వేసిన చెట్లన్నీ తలలూపుతూ వింతశోభనిస్తున్నాయి. అప్పుడే ఉదయించిన సూర్యుడు తన లేతకిరణాల్తో యమునానదీ తీరంలోని అందాన్నినుమడింపజేస్తున్నాడు. మంచు బిందువులు అక్కడక్కడా స్పష్టంగా

కనిపిస్తున్నాయి. ప్రతి బిందువులో వింత రంగులు, ప్రతి పాదలో ఓవింత ఛాయ, గాలి కదలికలోని ప్రతి ఊపులో వింతహోరూ వినిపిస్తున్నాయి. అల్లంతదూరాన మేతకెళ్ళే పశువుల మెడల్లోని గంటలశబ్దము, గోపాలబాలుర అదలింపులు, పకపకలు, కేరింతలు ... మరింత శ్రద్ధగా వింటే వినిపించే పక్షుల కిలకిలా రవాలు-క్రమంగా ఆలయజేగంటల నినాదం, అంతా విశ్వనాధుడి మేలుకొలుపు గీతాలస్వనంతో ప్రకృతి సందడిస్తుండగా తూరుపుదెస లేతకిరణాల్తో దివ్యకాంతులీనుతోంది. ఆ కాంతులతో ప్రకృతి తన ప్రతిబింబాన్ని యమునానదిలో తృప్తిగా చూసుకుంటోంది. అడపాదడపా పడేమంచు బిందువులు, అంతంత మాత్రమే ప్రవహించే యమునానదీ, చైతన్యం పురికొల్పే కోకిలకూతలూ చైత్రమాసాన్ని పూర్తిగాజ్ఞప్తికి తెస్తున్నాయి. అల్లంతదూరాన విరగబూసిన మాధవీలతా నికుంజములు చల్లగాలికి తలలూపుతున్నట్లున్నాయి. ఆ పరిమళాన్నాస్వాదిస్తూ గోపకాంతలు తమ చంకలో బానలు నిలుపుకుని వయ్యారంగా యమునానది వైపు సాగిపోతున్నారు. ఆదరినే నిటారుగా నిలబడివున్న పొగడచెట్ల నీడల కదలికలు చూస్తే నల్లనయ్య సాగిసాగి తమవైపే వస్తున్నట్లు భావించి వొకరినొకరు భుజాలు పట్టుకుని వింతగా చూస్తున్నారు. వారిగుసగుసలు మూడవ గోపిక వినకుండా వుండేందుకు తాపత్రయపడుతున్నాయి.

అలా .... అలా ఎంతోసేపుసాగి, నదీతీరం చేరిన తపతి, నవ్వుతున్న నర్మద, నిండుగా నిట్టూర్చిన నిర్మల, అందరికీ యిష్టసఖిఇందిర, రమ్యభాషణాచాతురి రజని, పులకరించి కౌగిలిలో బాననదిమిన కౌముది, అదిగోనల్లనయ్య! అంటూ నడకమార్చిన నళిని, విసుక్కున్నా వింతనభినయించే విమల, అందరినీ అదలించిన అరవింద, ముందే వున్నాడని కన్నులతో జోస్యం చెప్పిన జ్యోతి, అందరూ వరుసగా నది వొడ్డునచేరి చీరలు విడిచి నీటిలో దిగారు. ఆయలల తాకిడికి లేచిన తుంపరలు గోపికల తలలపైబడి మంచుముత్యాల్లా మెరుస్తున్నాయి. భూగర్భం చీల్చివచ్చిన బాలార్కుడు తన బంగరుకిరణాల్తో వారికి చక్కిలిగింతలు పెడుతున్నాడు. ఆగిలిలోవున్న చల్లదనం, ఆపైన వెచ్చదనం వారిని సౌందర్యోపాసనోన్ముఖులను

చేయబోతున్నాయి. పాపం! ఆ లేత మానసాలను పుణికి పూర్ణలయం చేయబోయే అనుభూతికి మూలమేదో వారు గ్రహించక మధనపడుతున్నారు.

తెల్లవార్లూ పతుల కౌగిళ్ళలో నలిగిపోయిన ప్రౌఢలూ, శ్రీమతులూ-తమ ఇరవైయేళ్ళ జీవితంలో యౌవనం మొగ్గతొడిగిన తొలి నాలుగేళ్ళనుండీ నయనానందకర సౌందర్యాలన్నీ తిలకించి విసిగిపోయిన యౌవనవతులూ, జవరాండ్రూ-రాబోయే శృంగారానుభూతుల స్వరూపం లీలగా చవిచూడబోయే ముగ్ధలూ, కన్యలూ-ఆగోపసమూహంలో కనిపిస్తారు. వారిదేహాలు తడిసిన వస్త్రాల్లో కడిగిన పుష్పాల్లాంటివి. చల్లని నీరు చిలుకగానే పొంగిన దళసరిమొగ్గల్లాంటి వక్షోజాలు, వంగిన కాడల్లో తొంగి చూసే చెంగలువల్లాంటి అరచేతులూ కలిసి, కృష్ణవేణుగానామృతం చెవుల సోకగానే ఇందుముఖుల్లా వికసిస్తారు-వంతగా నినదిస్తారు.

వీరుగాక, ఆ వనసీమలోనే అమరసౌందర్యం అలవోకగా ఆస్వాదించబోయి, ఆధ్యాత్మికపు రంగుతెరల్లో చిక్కుకుని, సుందర స్వప్నంగా మార్చుకున్న ముముక్షువులై, సుదీర్ఘకాల శృంగార విరాగులై యుండి, తెలియని మాధుర్యం కోసం వెఱ్ఱిగా ఘోషించే పరివ్రాజకులూ వున్నారు.

స్వేచ్ఛగా యమునాజలంలో స్నానమాడుతున్న గోపకాంతల్లో ఒదిగివున్నగుబులుకు అర్థమూ సౌందర్యోపాసనే. ఆగుబులులో వేయి మోహావేశ జ్వాలాశిఖలు. ప్రతి జ్వాలలో కోటానుకోట్ల విస్ఫులింగములవంటి ఆరాధనా నిట్టూర్పులు. ప్రతి నిట్టూర్పులో అనంతకోటి విశ్వాస వాయువులు. ఈ వాయుపీడనంతో వూపిరిసలుపని నాడు "భగవానుడి హస్తం" వొకటి ఎదురువచ్చి ప్రసన్నతని సృష్టిస్తుంది. అంతవరకూ చేసే యత్నం వొక యజ్ఞం. ఈ యజ్ఞభారానికి నడుంవంగిన వారు, యాచించడమే వుచితమార్గంగా తలుస్తారు. అదీ ఒక చిత్రమేనని తెలియ జెప్పి, వక్రతలో కూడ విశిష్టతే వుందని చాటిచెప్పడానికీ యాచకులను

ూడ సంరక్షిస్తాడు.

యమున వొడ్డుకు నిర్వికార స్వభావుడుగా వచ్చిన నీలమోహనుడు చీరలెత్తుకు పోయి చెట్టుకొమ్మపై వేసుకుని కూర్చున్నాడు. ఆవేళ .... ఎవరేకన్నులతో చూసినా, ఏ కావ్యంతో మలిచి రచించినా, ఆయన చిలిపితనమే గుర్తించి శృంగారంలో సంగరించారే కాని, మూర్తీభవించిన స్త్రీ సౌందర్యం లోకానికి సామూహికంగా తెలియజేయడంలో కాదు. ఆమాటకొస్తే-"స్త్రీలు పరస్పర స్పర్శలో కూడ ఉద్భవించే హాయిని, గోపభామినులు విధిగా పొందారనడంలోనూ, తద్వారా కృష్ణసౌఖ్యం కూడ కేవలం యిలాంటి స్పర్శతోనే రెట్టింపు అవుతుందనే తన్మయత్వంలోనూ, కరిగిపోవాలనే ......... వారిని అలావదిలేశాడనవచ్చును. ఆమీదట తన యోగమాయా స్వరూపంతో వారినుడికించి, అస్ఖలిత బ్రహ్మచారిగా తాను మిగిలిపోయాడు. ఏదియెట్లున్నా-ఆవేళ వారు నదిలోనూ, తానుచెట్టుపైనా వుండి, ఐహికావలంబనాన్ని క్షణికంగా వారినుండి దూరంచేసి, వారి ఆరాటాన్ని ద్విగుణీకృతం చేయడంలో కృష్ణస్వామి పాత్ర అమోఘమైంది.

"కృష్ణా! కో అత్ర మమబంధుః! త్వమేవ త్వమేవ." (కృష్ణా! ఇక్కడ నాకుబంధువెవరు-నీవుతప్ప) అనే గోపకాంతల ఆనంద రసమయకావ్యగీతాలాపనల సంధ్య "నీలిమ" తొలగించి, దివ్యతేజస్సౌందర్యాన్నిచ్చిన మూర్తిని-తమకళ్ళలోనింపుకుని, ఆనాటి కేళీవిహారాన్ని ముగించారు గోపికలు. కాకపోతే, పెద్దమ్మణ్ణగని ఉదయవేళ, స్నానమాచరించువేళ, పరువం పొంగి పైటలు జార్చిన వేళ, పరవశించి పరమాత్ముడు పిచ్చివాడైనట్లు నటించి, ప్రేమికులను పిచ్చివాళ్ళవెల్లా చేస్తాడు? అందుకే .....;

భక్తులనూ ..... భయంకరులనూ బాధ్యతాయుతమైన రూపాల్లో సందర్శిస్తున్నాడనడంలో సందేహంలేదు. "అదే సృష్టి విచిత్రం" అంటారు కొందరు.

మరి-సందెవేళ సౌమ్యతను జీర్ణించుకున్న ఆకాశం, వర్షం పడివెలిసిన తరువాత

సుగంధాన్ని విరజిమ్మి చల్లదనాన్ని పరచిన భూమీ, వేగాన్ని తగ్గించి ప్రశాంతసుమపరిమళాన్ని తెచ్చి-ప్రాణులనూ, ప్రకృతినీ నిర్మలం చేసిన వాయువూ,-సముద్రాలు ఘూర్ణిల్లే బడబానలాన్నిరేపి, ఆర్పివేసిన జలశక్తీ-జలశక్తిలో ఉద్భవించ మెరిసి, శీతలత్వాన్ని చెరచి, వెచ్చదనంలో మరిగించిన వేడీ .... పంచభూతాల్లో చేరి, పరమానందాన్నాశ్రయింపజేసే విశిష్టసౌందర్యాన్ని సృష్టించిన రోజుల్లోనే-ప్రజాకోటి క్షేమంగావుండేది. కాగా, పరస్పరావగాహనలో ప్రత్యేక భగవత్ సౌందర్యాన్ని ఆరాధించే తత్వంతో ఉన్నతాశయాలకి వూపిరులూదుతూ మోక్షంపొందే మార్గం సుగమమైనప్పుడు మాత్రమే జీవుడికి నిండుదనం సమకూరేది.

ద్వాపరయుగంలో అందుకు కావలసిన శక్తి నూరు పాళ్ళూవుండేది. ఆనాడు ఈ ఆనందం అడుగడుగునా వెల్లివిరిసింది గనకనే, ముక్తిమార్గ సాధకులుగా వారు ఖ్యాతిని పొందగలిగారు. అలాంటి వారిలో "ఆత్మసౌందర్యరాశి రాధ" ఒకతె. ఆ మీద నందుడూ లీనమై ఆనందుడయ్యాడు. యశోదాదేవి తన యశశ్శరీరాన్ని దిగంతాలకు పెంచింది. దేవకీవసుదేవులు సుదీర్ఘకాలం పుణ్యగతులు బొందారు.

అలా యెందరెందరికో పుణ్యగతులు జూపిన శ్రీకృష్ణపరమాత్మ లీలా మానుషవిగ్రహుడుగా ఆనాటి యుగంలో మిగిలిపోయాడు. "అర్హత" అనే వయోభేదంలేని ప్రాణులన్నీ-అయనని దివ్యసమ్మోహితస్వరూపుడిగా గుర్తించి తరించాయి.

అవతారాలు మారుస్తున్న ప్రతియుగంలోనూ అర్చకులుగా మిగిలిపోయిన ప్రతిఒక్కరికీ, తరువాతయుగంలో ప్రత్యేకస్థానం యిస్తూవచ్చిన భగవానుని స్మరణలోనే నిగూఢ సౌందర్యంవుంది. కాల క్రమంగా జీవుడికి తనజన్మలోని రహస్యఫలితం చూపించి, తదనంతర కార్యసాధనకు వుద్యుక్తునిగావించడం ఆయన ధర్మం. "అదితెలిసినప్పటికీ, యెందరు తనమార్గాన్ని విశ్రమించకనడుస్తారు"?-అనే ధ్యాసతో ఆయనెప్పుడూ వుంటాడనేది అక్షరాలా (నమ్మమనేదే హిందూధర్మ

సిద్ధాంతము ననుసరించి) నమ్మదగింది. అందుకేగాబోలు ... వారికి లీలగాతోచి, ఎంతో నిరీక్షణకు తావుకల్పిస్తూ ... మననంలోనే మరిగిపొమ్మంటాడు. ఆ మననమే సౌందర్యరాశిలా ప్రజ్వరిల్లుతుంధని ప్రబోధిస్తాడు. అదే లక్ష్యంగా అనుక్షణం చేసే యీ మననమే ఒక మాధుర్యాన్ని సృష్టించి మోక్షంవైపు తీసుకుపోతుంది. తనలో లీనమయ్యేందుకు చేయూతనిస్తుంది.

అలా క్రమంగా మనోసౌందర్యం ఫలించి మహోన్నతికి మూల మవుతుంది. అదిగో! ఆ స్థితిమాత్రమే ప్రతిప్రాణినీ ఈశ్వరారాధనంలో సంగమింపజేస్తుంది. అదేనిజమైన సౌందర్యంగా భాసించి, ఇహాన్నిమరపించి పరమును సందర్శించగలమనే ధృఢ విశ్వాసాన్ని కలిగిస్తుంది.

ఆ సౌందర్యమే ... ఆనందుడికి మనోల్లాసాన్నీ, మనుధర్మ నిర్వహణ సార్ధక్యతనీ కలిగిస్తుంది.

" విరాణ్మూర్తి విగ్రహ సందర్శనమే ఒక సౌందర్యం" అనే ఈ తృప్తితోనే జగత్తంతా పరిపూర్ణహృదయంతో" కలియుగదైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామి కోసం తిరుమల సందర్శిస్తున్నది.

" సర్వం తానైయై-నమ్మినవారికి సకల పాపవిముక్తిని కలుగజేస్తాడు" అనే కదా భక్తజనుల పరిపూర్ణ విశ్వాసం.!

×××××

# 7

ఆ రోజు ... !

అంగరాజయిన కర్ణుని పాండవపక్షంలో చేరమని అడిగి వచ్చిన కుంతీదేవి చెప్పిన సమాధానం విన్నతరువాత కృష్ణుడు మౌనంగా వుండి పోయాడు.

బావా! "నిత్యమంగళమూ, నిర్మలత్వమూ చోటుచేసుకున్న నీ మూర్తిలో ఈ నిర్వేదం తగదు. నిరంతరమూ నీ తలపులే జీవనంగా జీవిస్తున్న మాకు నీ ప్రభుతనే మిగిల్చు. ఏకాంతంలో దిగంతర దర్శింప జేయగలిగిన మీర్లే యీ స్తబ్దతను సృష్టిస్తున్నారు". అంటున్న యుధిష్టిరుని చేయిపట్టి...

" రాధేయుని హృదయసంస్కారం నన్నూపిరిసలుపనీయడంలేదు ధర్మజా"! అన్నాడు కృష్ణుడు నిర్మలంగా.

నీలిమలోసైతం నిండు మోహనత్వం వుందని నన్నుబుజ్జగిస్తున్నావా స్వామీ?

లేదుకౌంతేయా! నిజధర్మంలో యెంతటి ఉత్కృష్టత వుందో తెలియనివాడుకాదు అంగరాజు. " స్వధర్మంనిధనం శ్రేయ: పరధర్మోభయావహః" అనే ధర్మసూచిక స్పష్టపరచాడు కూడ.

దేవదేవా! రారాజు కిచ్చిన మాటనిలుపడానికి మాత్రమే తానభిలషిస్తున్నట్లున్నది. కాని ధర్మపాలన విషయంలో కర్ణుడికి అవగాహన తక్కువున్నట్లనిపించడంలేదా? సహధర్ముల అసంతృప్తి మాత్రం ఆయనకు ఆనందాన్నిస్తుందని నేననుకోవడంలేదు.

"ధర్మపాలన గురించి నీకుమాత్రం తెలియనిదేమున్నది? స్నేహధర్మం కూడ విశిష్టమైనదనడానికి యింతకన్నా రుజువేంకావాలి? తన అభీష్టం మేరకు తాను స్థిరసంకల్పుడై వుండడమంటే, అది ఆయన సత్యప్రౌఢిమకు నిదర్శనం కాకేమవుతుంది? అదీగాక, వెళ్ళిందిసాక్షాత్తూ మాతృ మూర్తి కదా! ఇన్నాళ్ళు ఆమె అనుభవించిన గర్భనరకం ఈమూలంగానైనా కొంత పరిష్కారమవుతుందని ఆవేదన చెందింది. అంతకు ముందు నాకెన్నోమార్లు జ్ఞాపకం చేసింది కూడ. "ఈ బాధ భరించలేను కృష్ణా! ఒక్కసారి కర్ణునితో మాట్లాడే అవకాశం కల్పించు ప్రభూ"! అని నేనుమాత్రమేంచేయగలను? పరిస్థితులు అనుకూలించినప్పుడే నీకది సాధ్యమవుతుందన్నాను. ఈ రోజు ఈ రూపంగా కలుసుకునేందుకు వెళ్ళింది. అయితే, అందుకు భిన్నమవడం, కాగా తాను మాతృత్వాన్ని పూజించి కుంతీమాతకు వరమిచ్చి, తాను నష్టపోతూ ఆమెకు కొంత వూరటకలిగించి, నిమ్మళించాడు. ఇంతటి ఔదార్యాన్ని ప్రదర్శించిన క్షత్రియ ధర్మాన్నీ, స్నేహధర్మాన్నీ, పరమదాతృత్వాన్నీ విడువని కర్ణుని స్థిరత్వానికి ఆశ్చర్యపడక తప్పదు''. అన్నాడు కృష్ణుడు.

''కాలగమనంలో ఎన్ని మార్పులు సంభవించినా చలించని దీక్షతో తనకేమీ తెలియనట్లు, నిర్విరామంగా తనపని తానే చేసుకుపోయేతత్వం కర్ణుడికి సూర్యభగవానుడి ద్వారా సంక్రమించి వుంటుంది.'' చిరునవ్వు నవ్వుతూ అన్నాడు ధర్మరాజు.

కర్మసాక్షి ..... కర్తవ్యబోధ ..... సకలప్రాణులకిది ఆచరణీయమే అనుకో. అయినా ..... నేర్పు, స్థిరసంకల్పం ....... దీక్ష వుండాలికదా! ధర్మకార్యంపట్ల నీకున్న నేర్పు నాకుందంటావా ధర్మనందనా !

అపచారం -అపచారం ... కృష్ణా! నన్ను పరీక్షించడమా ప్రభూ! మీనేతృత్వంలో

... ఆచరిస్తున్నదెంతో మీకు తెలుసు. దివ్యతేజస్సును దర్శించి శ్రీ
...ందించడం తప్ప నేనెంతవాడినయ్యా!

...ందనా! అజాతశత్రువుగా భారతకథలో నీపాత్ర ఎంతటి దీక్ష వహిస్తు
...వా? నీ కున్న ధర్మప్రౌఢిచే శత్రుత్వాన్ని కూడ పరమసంతో
...చే నీ హృదయమార్దవం, ఆ దుర్యోధనుడి ప్రాయోపవేశానికి దారితీసిం
...లత్వం యెంతో ఆలోచించావా?

అయితే కావచ్చు. కాని ఎంతసేపు దాయాదులచే రక్షింపబ...
...నమానభారమే తప్ప, ఆలోచనలేని దుర్యోధనుడికి, మనధర్మం (కారు...
ఎంత...కు అర్థమయిందంటావు? పైగా వెంటవున్న కర్ణదుశ్శాసనులకు వ...
... ఆలోచించాలన్న అభిప్రాయంకలిగిందా స్వామి! దుశ్శాసనుడి
...వున్నా, "దుర్యోధనుడి పాలనలో వున్న ప్రజామూకలో పాండవులూ వున్నా...
అని సమర్థించగలిగిన కర్ణుడి భావం ఎలావుందంటావు? సందేహంగా అ...
ధర్మరాజు.

ఔను! ఆమాట ధర్మప్రీతిగానే వున్నా, కర్ణుడి మాటను వ్యంగ్యంగా స్వీకరి...
తప్పేమరి!

పోతే మిగతా పెద్దలసంగతేమంటావు కృష్ణా?

సన్నగా నవ్వి వూరుకున్నాడు కృష్ణుడు. కొంతసేపటికి ...

"మాట్లాడడం మానేశావెందుకు మాధవా"? అన్నాడు ధర్మరాజు.

"ఏం మాట్లాడను? విచక్షణా రహితుడికి వివేకం తక్కువ. రారాజు
చేసుకోలేనివాడయితే, వెంట వున్నవాళ్ళుకూడ వెర్రివాళ్ళెలా అవుతారు? ....... 
తప్పుగా గుర్తించేవాళ్ళు వుండికూడ ప్రయోజనం లేదనిపిస్తోంది. అదింకా కొం...
వారికే వదిలేయడం మంచిది".

ప్రభూ! ఆవేశాలు, ఆవేదనలు, ఆరాటాలు అనునిత్యం మా ఆంతర్యాల్లోనూ మరిగి పోతూనేవున్నాయి. అయినా అత్యంత సన్నిహితుడవై మాకు అండగా వుంటున్నావు. నిరంతరం 'స్మృతీ–విస్మృతుల్లోనూ నీవేకదా మాకు"! అంటున్న యుధిష్ఠరుడి కళ్లు అశ్రుపూరితాలైనాయి. క్రమ క్రమంగా మూసుకుపోతున్నాయి. అస్పష్టంగా కృష్ణస్వరూపం కదలిపోతున్నట్లనిపించింది. అనంతవాయువుల్లో అనూహ్యమైన ప్రాణికోటి ఆనందోత్సాహాలు ...! ఆహా!....... కృష్ణా!.... నీమూర్తి సౌందర్యం! ఎంతమధురమైనదా పలుకు ......... ! ఏమా దర్శనం? ఏమా నృత్య భంగిమ! ... ఆహా మురళీనాదం !! ..........!

యుధిష్ఠరుని కలవరింతలు విన్నద్రౌపదీదేవి, అదేమిటిప్రభూ! కళ్ళుమూసుకున్నా కనిపించే సౌందర్యం యెలా వుంటుంది? అని ప్రశ్నించడంతో కళ్ళు తెరచి నవ్వుకున్నాడు.

మురళీధరుడు ........ తానునమ్మిన ........ నచ్చిన విషయాలు ఎంత తీయగా చెప్పగలడు ! ఎంత లీలగా కనిపించగలడు!

"ఏమీ! కృష్ణస్వామి యిప్పుడు వచ్చాడా? ఏదీ యెక్కడ"?

ఇదిగో!"యిప్పుడే వెళ్ళి పోయాడు. ఈ దారినే .... అంటూ లేచివెళ్ళబోయి మళ్ళీ కూర్చున్నాడు. "మన యింట్లో ఆరగింపుకు కూడ సమయం లేనట్లుంది దేవీ' '! ఆనందాశ్రువులు, రెండుకళ్లల్లోనూ జారడానికి సిద్ధంగా వున్నాయి.

లేదుప్రభూ! నాకు కనీసమైనా జాగ్రత్త చెప్పకుండా వెళ్ళలేడు సుమా! కల్పించుకుని వంటగది దాకా వచ్చే వాడేకదా!

నేను పొరపడడం లేదు దేవీ! యదార్థమే చెప్పుతున్నాను. కాకపోతె .....!

ఎందుకుప్రభూ!నేనర్థంచేసుకోగలను. "కాలాన్ని నిలిపివేసే వ్యూహాల్ని కూడ

మనలో నెలకొల్పగలడు" చిరునవ్వు నవ్వుతూలోపలికి వెళ్ళిపోయింది ద్రౌపదీదేవి.

"ఆమె మాట విన్న ధర్మరాజు నిర్ఘాంతపోయాడు."

కృష్ణతత్వమెరిగిన వాళ్ళలో తానే మొదటి వాడిననే "భ్రమ" ఆయన్ని మందలించింది. నాలుక కరచుకున్నాడు.

ద్రౌపదీ దేవిలో యెంతటి తెరువరితనం! ఏమా ఆంతర్యప్రౌఢిమ! యింతకు ముందెప్పుడో ఆ అనుభూతి తనకూ కలిగినట్లే స్ఫురించింది ........ ! నిమ్మళించాడు.

"కృష్ణ భగవానుడు కూర్మి యొసంగి, నాకింత కలిమిని ప్రసాదించాడు. ఆబలంతోనే నా అభీష్టాన్ని యథాతథంగా నెరవేర్చుకోగలుగుతున్నాను". అని ధర్మనందనుడెన్నిమార్లో తలచుకున్నాడు.

అలా ..... కృష్ణుని సాంగత్యంలో వున్న ప్రాణులందరూ యేదో ఒక రకంగా కర్మబద్ధులై, తమకంటూ యేర్పరచుకున్న నిర్ణయాల్లో నేర్పును సాధించారు. "అదంతా ఆ స్వామి చలవే" అనే భక్తులు ఆయుగంలో ఎందరో ... ఎందరెందరో ....! మరింకెందరో.........!

ముఖ్యంగా నేర్పు అంటే, తెలివిగా తప్పును సూచించకుండా చేయగలిగే పనితనం. పరిపు-ర్ణులైనప్పుడే ప్రౌఢలైపోతారనేది సత్యసామీప్యం. ఇలాంటి వారినెందరినో శ్రద్ధగా ప్రపంచానికి తెలియజేయడానికే నేమో! ఆయా పాత్రల కలాంటి పరీక్షలు పెట్టడం. తాను అలా నడిపించడమే ఒక నేర్పుగా, ప్రౌఢత్వంగా భావించడం తప్పుకాదు. -వే కృష్ణతత్వానికి పరాకాష్ట .

లోక కల్యాణార్థం భగవానుడుచేసే ప్రతి లీలా, అందలి విశేషమూ గమనించదగిందీ .... ఆనందించదగిందీను.

xxxxxx

# 8

సృష్టిలో మానవుని పుట్టుక ఉత్తమోత్తమం. పశుపక్ష్యాదుల కంటే మానవునిలోని బుద్ధి ఒక విశిష్టతను కలిగి వుంటుంది. అది కేవలం జ్ఞానార్జనకే వినియోగించితే సృష్టిలో ప్రముఖస్థానం పొందగలుగుతాడు. బుద్ధి వినియోగంలో లోకజ్ఞానం, జీవితానుభూతి, గురుసేవనం అత్యంతావశ్యకాలు. ఇందే అంశాన్ని సరిగా వినియోగించ లేని పక్షంలో శాస్త్రపఠనం చేయడం ముఖ్యం. శాస్త్ర సాధన ద్వారా తానుకోరిన లక్ష్యం చేరుకునే అవకాశం మానవుడికి మాత్రమే వుంది. పశుపక్ష్యాదులకిది శూన్యం గనక, సాధనలో అమేయమగు భక్తిసంపదను పొంది. వానికి అతీతుడుగా జీవించి, ముక్తిమార్గంవైపు సాగిపోవడమే మానవజీవిత లక్ష్యంగా వేదపురాణాలు చెప్పుతున్నాయి.

కృష్ణభగవానుడు తానొక అవతార పురుషుడుగా గాక, జగత్తున కాధారమైన ఒక నిర్గుణాకార తత్త్వముగానే నడుస్తూ, ఈశ్వరాధికారంతో మాత్రమే తత్త్వబోధచేశాడు. అంతా తనవాళ్ళే అనే స్వార్థచింతన విడనాడి, దుష్టశిక్షణార్థం యుద్ధాన్ని ఆరంభించాలని అర్జునుడికి ప్రబోధించాడు. యుగ సంక్షేమం కోసం లోకంలో ధర్మం స్థాపించడానికి నిమిత్తమాత్రుడైన మానవుడికి కూడ స్వార్థచింతన పనికిరాదన్నాడు. కర్తవ్యం నిర్వహించే వాడిని ఓదార్చి కన్నీరుపెట్టి కాలహరణం చేయడంవల్ల ఫలితంశూన్యమన్నాడు. అందుకే సర్వార్థ సారమగు గీతను బోధించి, అజ్ఞాననిర్మూలనంగావించి, శోకమోహాలనుండి అర్జునుడిని ఉద్ధరించాడు.

వ్యక్తావ్యక్త స్వరూపమే పరమాత్ముడు. ప్రయత్న ఫలం వల్లనే సృష్టిలోని సకలకార్యాలు నిర్వహించబడుతున్నాయి. ప్రయత్నమే లేకుంటే

ఎక్కడిజడపదార్థమక్కడే వుంటుంది. ఏయేవస్తువులేయే విధంగా సమ్మేళనం చేస్తే, ఎలాంటి భౌతిక, రసాయన-క్రియ జరుగుతుందో తెలియడమే ప్రయత్నం. దీనినిబట్టి సృష్టిలో ప్రతివస్తువూ ఏదో ఒక రకంగా ఉపయోగకరమనే భావించాలి. దురుపయోగంచేస్తే వినాశనమవుతుందని తెలియడం కూడ వొక జ్ఞానమే అవుతుంది. అలాంటి శక్తిని సాధించిననాడు ప్రకృతిలో వున్నదంతా వ్యక్తం కావలసిన అంశమే అనడం స్పష్టం. ఇక అవ్యక్తమైనదేదో వుందనే తలంపుకు వచ్చి, ఆలోచించినప్పుడే, ఆరాధించినప్పుడే దేవుడని స్ఫురిస్తుంది. ఆదేవుడు సకలశక్తికీ, ఆనందానికీ, జ్ఞానానికీ ఆధారమని తెలిసిపోతుంది.

ఈ శక్త్యాది సాధనలన్నీ పరమనిష్ఠతోనే సాధ్యపడుతాయి. వీనిని గ్రహించిన మీదటనే వ్యక్తమైన ప్రకృతి యందున్న సమస్తగుణాలూ వాటి ఉపయోగాలూ స్పష్టంగా తెలిసిపోతాయి. నిస్వార్థంతో "అవ్యక్త" పరమాత్మలోని దివ్యశక్తిని గ్రహించి, ప్రపంచ స్వరూపుడైన "వ్యక్త" పరమాత్మకర్పించి, అందించినప్పుడే జీవన్ముక్తుడవుతాడు. అంటే జన్మరాహిత్యాన్ని పొందుతాడని అర్థం.

అందుకే నిరంతరం తనకర్మతానాచరిస్తు, పరమాత్మ తత్త్వంవైపు సద్బుద్ధితో సాగిపోయే అనుభూతినే "లయం" అని వ్యవహరిస్తున్నాం. రామావతారంలో హనుమంతుడూ, కైకేయి, దశరథుడు, గుహుడు, శబరి, ఊర్మిళాదులు ఈ అనుభూతిలోనే లయమయ్యారు.

భాగవత కథనంలో కృష్ణపరమాత్మ చిన్నతనం నుండే కొన్ని అద్భుతాల్ని ప్రదర్శించాడు. అందువల్ల గోకులంలో వున్న ఆడా, మగా ఆయన్ని వింతగా వూహించుకున్నారు. దీర్ఘాలోచనలో నిమగ్నమైన కొంత మంది మాత్రమే సునాయాసంగా ఆయన లీలల్ని గ్రహించి తన్మయులై పోయారు.

అందులో యశోదా నందులు తనువుండి కృష్ణుని బాల్యం నిష్క్రమించాక

"ఇంతగొప్ప కృష్ణయ్యని నేనప్పుడేంచేశాను? కోపగించాను. శిక్షించాను. ఎంత తప్పులని చేశాను! అయినా! తల్లిగా ఆమాత్రం చేయకూడదా? చేసినా, పిచ్చితండ్రి! ఎప్పుడూ నామట్టే తిరిగి గారాబం చేశాడుకదా! ఏమో! ఇదేమిటి? నాకళ్ళల్లో నీళ్ళు ఆగిపోవడంలేదేమిటి"? అంటూ కళ్ళు తుడుచుకుంటున్నప్పుడు, ఎదురుగావున్న నందుడూ తుడుచుకున్నాడు.

ఏమి వాత్సల్యం? యింకా ...... ఇంతవయస్సు వచ్చాకకూడ ఆ తల్లికి యే పిలిచినా అమ్మా! అనిపిలుస్తున్నట్లుంది. అక్కడేకాదు. వంటగదిలో .... ధ్యానమందిరంలో ...... పెరటిగుమ్మంలో ...... ఏ కాంత స్థలంలో ...... ఎదురుగుండానే ...... వెనకాలే ...... ప్రక్కప్రక్కనే అమ్మ ! అమ్మా ! అమ్మాని" అనే ఆ మధుర కంఠం" వింటూనే తన్మయత్వం పొందింది. ఆ తల్లికి ఆ అనుభూతిని మించిన విషయమేముంది.?

నందుడుమాత్రం ......! తాను పడుకునే తల్పంపై వెల్లకిలా పరుండి, రెండు చేతులూ తలదిండుగా పెట్టుకుని జాములతరబడి ఏ మాలోచిస్తాడు? అదే ...... అది మనకి తెలియాలి?

ఇలా సర్వేంద్రియాల్ని బలీయంగా ఆరాధనలోకి దింపి, తమ అధీనం చేసుకునే మహత్తరశక్తికే "ద్వైతత్వం" వుంది. అద్వైతత్వమే కృష్ణభగవానుడిలో ఒక అంశం.

ఇదే అనుభూతి దేవకీ వసుదేవులూ అనుభవించి తరించారు. ఆ తరువాత దినదిన ప్రవర్ధమానంగా స్వామిదీక్షలోని "మాధుర్యం" పరిపూర్ణమైన రక్తితో అనుభవిస్తూ సర్వేంద్రియాల్ని పరవశంతో పరమాత్మకర్పించుకున్న రాధామూర్తి ధన్యురాలు! గోపికలు ఒక్కో ఆనందంతో, ఇళా, మిత్ర, విరజాదులు కృష్ణానందాన్ని అనుభవించారు.

ఒకటి వాత్సల్యమైతే మరొకటి శృంగారం. ఒకటి ముగ్ధత్వమైతే మరొకటి ప్రణయ తత్వమూను.

అందరూ ఆ శక్తిలోని సౌందర్యాన్ని ఉపాసించడమేగాని వేరుకాదు. అందరికీ ఆనందం పంచి, జగత్కళ్యాణం చేయాలన్నదే ఆ తపన. అందరూ అన్నిరకాల ఆకర్షితులు కావడమే ఆయవతార విశేషమని విజ్ఞుల అభిప్రాయం.

భక్తజనలోలుడూ, శాశ్విత సుఖప్రదానుడూ అయిన శ్రీకృష్ణభగవానుడి, పరిపూర్ణభక్తితత్వం, ఆ నాటి ఆబాలగోపాలానికి ఆనందాన్ని పంచియిచ్చింది. కడలేని మాధుర్యాన్ని ప్రసాదించింది. అందుకు ఆయన బంధుజన, భక్తజనప్రియుడై యుగయుగాలకూ ఆదర్శమయ్యాడు.

ఏదియేమైనా, యోగమాయాన్వితమైన "ద్వాపరధర్మం" సర్వలీలా ప్రదర్శకమై సంభ్రమాశ్చర్యాల్లో ముంచి జగత్తునంతా తనలోనే "లయం" చేసుకుంది. తననే సర్వదా స్మరించమంది.

" సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ!
అహంత్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః!!"

x x x x x x